రువదినాల్గు వేలగ్రంథంబిది యేనూఱుసర్గలనింపుగులుకు । పట్టాభిషేచనపర్యంతకథలారుకాండంబులరచించె గడపటికథ । నవలనుత్తరకాండంబునందమర్చె । నంమహామౌనియతనిదియానిరూఢి । గనె మూర్ఛితమిదివిననిచ్చగల్గె । నేనపినదదుదినమునుని ర్విధమున ॥ క ॥ ఇంమనిఘనిష్ఠులుదీర్చన । పింపటనొక్కకొంత సేపుప్రియమున నికా — । వయముంపిన పలయు మాగీ । తంములుసాఫల్య మొందధరణీశ యనక ॥ గీ ॥ సంమతించి రామజనపతి బహుమతి । వెలయ వారిబనిచి ద్విజపురోహి । తార్యబుధసహితుడయి యాగ మంటపా । భ్యంతరమునను డెనర్హవిధుల ॥ చ ॥ దినదినమిట్లు జగజ్జగతీసతి మన్ననుపుష్పదేనెవం చినగతిగ ప్రవర్తరజము చిందినకె యువడిజాజిపొట్లముల్ । మొనగొని విప్పినట్టులతి మోహనగానకళానిరూఢిన । య్యనఘులు మోహనచ్ఛవిని మించిన గాత్రమెనగ స్వనపింపుచు నెసక ॥ చ ॥ జనవరుడంతనొక్క దివసంబున వారితనూవిలాసమ్ । గనుగొని జానకీరమణికై వడినున్న నిపేరిరూపుల । వ్వనజదళాక్షికిన్ను గవల్గ వియంచిరటంచు వింటెన । త్తనయులె ఈశుభాకృతులు లెక్కనని చెలువంబులుండునే ॥ చ ॥ జడలు ధరించి కృష్ణమృగచర్మములుం బలునారచీరలుం । గొడుకుల దానుగట్టుకొని కూరలగాయలు ద్రుత్తుచున్నచుక్ । గుడిగొనువంత రేజగలుగుదుచునెంతగలంగియున్నదో । యడవులలోన సీత యెట్టటాయికజూడక యెట్లు తాళుదుక్ ॥ ఉ ॥ త్వోసుతవాసినేను బహుకాలము తాలి దైర్యశాలినై । యాస్తతిబిల్వనంప్రజ లంబుసంయమిక జెందనిసభక । బాసయొనర్పబంచయిక బావనియాలెటిగింపకుండిన న్నాసుతులంచువీరి । బ్రజనంబు నెయంచు దలంచి చెచ్చెరక ॥ గీ ॥ చెంపనిలుచున్న శత్రుఘ్ను జేర

(*) రఘుపుంగవుండు వాల్మీకాశ్రమంబుననున్న సీతం బిలుపించుట. (*)

బిలిచి । పలికె బులనియోవత్స పవనసుత వి । భీషణసుషేణులను వెంటబెట్టుకొనియు । కల్మషుండయిన వాల్మీకి గానబోయి ॥ వ ॥ జనకజ ధర్మచారిణియు సాధ్వియు నౌట యెరింగియుండియు । జనులోనరించు నిందబడ జాలక విడినమాత్రమంతెయు । జనులకు బ్రత్యయంబొడవ సభ్యులలోకపథంబు బల్కిన । వ్వనజదలాక్షి దోగుకొని వచ్చుట మేలను మంమునీంద్రుతోక ॥ క ॥ ఈమాటకం మహాముని । యెమని ప్రతిభాషలానతిచ్చునో సీతా । భామినిహృదయస్థిగని । యేమనునో యదియు దెలిసి యె తెండనినక ॥ ఉ ॥ స్వామిమహాప్రసాదమని వారలు నల్వురు నంమహాముని । గ్రామణియున్న చోటికదికత్వర నేగి నమస్కరించి శ్రీ । రామనృపాలుమాటల తెరంగెరిగింపనతండు పల్కెదా । నేమిదలంచెనట్లు ఘటియించి ధరాసుత శంక యేటికిక ॥ క ॥ పతిదోవతాశిరోమణి । క్షితిసుత పథంబు సేయు సిద్ధము రేపా । క్షితిపతికి దెల్పుడీదియని । యతడనచినవారు వచ్చి యధిపతితోడక ॥ ఉ ॥ అంమునిమాటలెల్ల వినయంమున దెల్పిన రాముడెంతయుక । సంమదమంది యులముగల సభ్యులనందఱు జూచి యెల్లలో । కంముల మెచ్చరే పుజనకప్రభుకన్యక యీసభ స్వభా । ర్థంముగ పూని పల్కు శపథంబు వినంరగు మీరలిందఱుక ॥ చ ॥ శపథము సేయుచో నయిన జానకి సత్యమెంగుడీయనంద । పసులు ధారుణిపతులు వక్కిన జాతులు వారు బాంధవుల్ । గవులుని శౌదరుల్ హితులు గౌతుకవిస్మయభీతిమగ్నులై । రఘుదున్నపాలుడా జనులనందఱని ద్దసుబంచె నాటికిక ॥ వ ॥ ఇవ్విధంబున సభాసదులనందఱవిడుదలకుం బనిచిననిచి ముదంబున నత్తపనవిభావరిష్ఠుండవ్విభావరిం గ్రమించి మరునాడరుణోదయంబున గోమతీజలంబుల బ్రాతఃకరణీయంబులొనర్చి యర్చిష్మవాద దేవతార్చనంబులాచరించి సమంపుత ప్రకారంబున మహాహర్మ్యంటపంబు ప్రవేశించి భరతాదిసోదరులును సుగ్రీవాదివానరులును విభీషణాదిరాక్షసులును సుజేహరాజ కేకయరాజప్రముఖబాంధవులును బ్రవర్ధనాదిమిత్రులునును మంత్రాదిమంత్రిపటలంబును మథమద్వియజభద్రాదినర్మసఖులును బరివేష్టించి కొలువ నిండుకొలువుండి పృథ్వీసుతాకథితావితథశపథవచోవిధాశ్రవణకుతూహలంబునంబర తెంచిన వసిష్ఠవామదేవులవుల స్త్యకశ్యపాగస్త్య విశ్వామిత్రదువికాగ్నిమిత్ర మైత్రేయ భృగుచ్యవనజరాశరాత్రేయ కాత్యాయనగౌతమ శ్వేత శాతాపనులోమవరతంతు భరద్వాజవాలఖిల్యమార్గల్యమాండవ్య విభాండకమార్కండేయ కాండిన్యకణ్వప్రసన్న దేవశ్రవసబభ్రు శృంగమతంగమంకణాంగీరసశతానందమందపాలజాబాలి గాలవస్థూలపౌలస్త్యదుర్వాసః పర్వతనారదదళాదపిప్పలాద ప్రముఖ మహర్షులకు బ్రత్యుత్థానాదులొనరించి యుచితాసనంబుల నునియమించి పాంచాలమాళవగౌళచోళ మళయాళ మగధమత్స్యమద్రద్రవిడవిదర్భ శకసింధు గాంధార సౌవీర కేరళకాశ్మీర చేదిప్రముఖనిఖిల దేశాధినాథులసపరివారంబుగా వగుచోట్లం గూర్చుండనియోగించి బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులుదక్కిన పౌరజానపదాదిప్రకృతిజనంబులు నానాదిగంతరాళగత విద్వత్కవినటగాయకపరివారసముఖ యాచకనివహంబులు నలుదిక్కులం గిక్కిరి నివసింపనిలింప విభువయిభవంబున బొంపిదివోవుచు బావెతసాగమనంబు బ్రతీక్షించుచున్న యెడ నక్కడ వాల్మీకి మౌనీంద్రుడు దొలునాడె నిజాశ్రమంబుననున్న జనకనందనుం దానువిడసిన గోతీతటాశ్రమంబునకు బిలిచిపించినవాడు గాననద్దేవి నవలోకించి తల్లి భవద్వల్లభుడగు రఘువంశవల్లభుండు నీయుల్లంబు తెల్లంబుగా దెలిపియు బ్రల్లదంబులుచలకిన తుల్లక జనంబులు విశ్వసింప విశ్వమూర్తి బ్రహ్మర్షీశ్వర సభామధ్యంబుననిచె తిశపథంబులాడింపదలంచి నిన్ను వెంటబెట్టుకొని రమ్మని పన్నింబనిచి వాడతనివచనంబులం ఘనసీయు బదిగాక నినువంటి పతివ్రతలకు బతియనుమతిం బ్రవర్తించుట స్వభావసిద్ధంబుగదాయని దెలివినసపల్లవపాణి ప్రాణేశ్వర సందర్శనంబు నేటికయన నీనెవంబుగలిగె గనాయను మోదంబును దనపట్టపుదేవిపై నిట్టిపట్టి సంశయంబులు వు వప్పట్టభద్రుల

నమెల్లం గలం! గని తాంతస్థిరబుద్ధినిట్లు వలుకంగా కుత్సరాన్మొలిది! ధ్యానబద్ధాంజలియై వచ్చి చెనసభూత్మా సీతలోకయి కపా వనియంచుమ్ము! నులంకలోన తెలిసె నవ్వహ్నివేశంబునక్॥ చ॥ తెలిసియు లోకులాడు నడి దీర్పంగ గూడక యింత చేసితింగలదప రాధమోర్వుండలు గన్వలదిక్కవలస్మదీయవు। త్రులగు మదీసె స్వాద్వియగు రూఢిగనింకొకసారి సీతయుం। దలి ప్రజలౌన నంగ శపథంబొనరించినం జాలమేలగుక్॥ అనిమతియునిట్లు రియె॥ గీ॥ అనఘ మీరు పలుకునంతకం టెను సీత। యాదుశపథమెం

(*) భూమిదేవి సీతాదేవింగయి సేసి రసాతలంబునకుం గొంపోవుట. (*)

తన్మైనిచటి! ప్రజలకాపె పలుకు పలుకునంగాని ప్రత్యయము పుట్టదను చునరపుడనిన॥ ఉ॥ ఆరఘుపీసమాటలనునచ్చుతమం దిరితత్సభాసదు। ల్వారిజసంభవాదిసురవర్యులు మేలవి మెచ్చిరచ్చటక్। సౌరసుమావళుల్ గురిసెం జల్లని వాసనలుల్ల సిల్లగా సారెకు గంధసారగిరి సారసముచి చేరై పయిక్॥ ఉ॥ అజ్జనుసీతారాముని పదాంబుజముల్ హృదయయాంబుజంబునం! దప్ప కనిల్పి ధీరతను దబ్బుఖియై తలవాంచి ధాత్రిపై। నొప్పరెజాపలోకినము లుంచి కరాంబుజముల్మొగిడ్చి తా। నెప్పటెలుంగుతో సభికులెల్ల నువిస్మయమందసిట్లనుక్॥ శా॥ రామస్వామి పదాంబుజంబు లెద నారాదింతు నేనిన్సదా। రామాజ్ఞన్ జరియింతు నేనిందగు జా! గత్స వ్వప్నను ప్యాదులక్। తాముందప్పని దాసనాటయుయు ధార్మిం బెనినాతల్లి యో। భూమీ ఈ యెడం ద్రో వం జూపినను గొంపోవంమనిలోసికిక్॥ వ॥ అనిశతానందపురందరాది బృందారక సందోహంబునకు నానందంబును సనకసనం దనాదికర్మనిబృందారకులంకుం ఒకమాద్భుతంబును నరవానరనిశాచర ప్రముఖనిఖిల జనంబులకు శోకదైన్యంబులు నుప్పతి లంబలికిన యచ్చిలుకలకొలికిపలుకులతోడనె శతకోటిఘోషంబు ననుకరించి సంవర్తసమయ మునదిత జలధపసంఘసంఘుసఙ్ఘ గోజ్ఞాతనిర్ఘాత జాతస్ఫీతనినాదంబుననుసరించి ప్రళయ వేధా భయంకర పణీశ్వరాభంక దంష్ట్రాంకుర ఘోరముఖస హస్రమోముచ్య మానపిస్ఫురత్కీలికిలికాజాలస్ఫులింగ స్ఫుటాబీలరవానుకూల విశాలభూతాత్కారవిరావంబునధిగమించి యనల్పకల్పాంతకాలకంఠ కాలదిరూపులముద్రు జధకాటధమధమత్కారంబునకు సహకారంబయి బ్రహ్మాండకరండఖండ నోద్దండ తాండవ రావణవరుణాలయోత్తుంగజ ఘూలతరంగసంఘాత ఘుమఘుమార్భటి బ్రతిఘటించి తత్సభామధ్య ర త్నగర్భాగర్భంబునునుండి మొకటదీర్ఘ నిర్ఘోషంబావిదర్భవించెనప్పుడు హస్సదనహిరణ్యరకస్సహారరంహ సమారబ్ధ విజృంభమాణపీన నృసింహసంభవావసరవిస్ఫుణ సభాస్తంభగంభీరనిస్వనంబులకుందో బుట్టువులకు పటపటార్భటులసంఘ టిల్లనిలిచినంతటల్లతవలె నిలుచున్నపుడమిపట్టిక ప్రైదుట బుడమిబిట్టవిసిపటెల్లునంబగిలిన నప్పట్టున మహాబిలంబగు నొక్కమ హాబిలంబుగనుపట్టెనట్టిబిలంబులోనుండి కుండలిమిండ లేశ్వరకుటిలదంష్ట్రాపటలవటుల ప్రభలకయివడభోగవతీసరత్తరంగ మాలికవలెనత్తటినికటనికగనిగటస్థితహాటకేశ్వరకఠోర కంఠకాలకూటకాంతులవలెందత్సహచరపారిషదచ్ఛటాజటారుణ రుచులవలెబహిర్గతాంతర పయోధిబాడబజ్వాలికలవలెం గోమలశ్యామలతూర్వాదళాభర్వరోచులవలె వజ్రమౌక్తికనీల ప్రవాళపద్మరాగమరకతప్రముఖ నిఖిలమణిగణమస్పణఘృణిసరంబులు వెల్లితరిశి యచ్చటవారికన్నులకుమిఱుమిట్లుగావించె నంతనంతవాసుకితక్షకకర్కోటక జనమేజయప్రముఖ మహాభుజంగ పుంగవులభంగతరాభోగ భోగచిరత్నరత్నఖచితకిరీ టకుండలహారకేయూరకంకణాది వివిధభూషణభూషితులయి కాంచనవేత్రధారులగు నపరిమితనాగకుమారులతో గానుపిం చి మద్దేనికి బ్రమిల్లియనేకరీతులంబూజించి రయ్యెదంచి తాకృతుల దివ్యవస్త్రమాల్యానులేపనోల్లాసిత వాసనావిశేషం బులా గుబ్బుగానమంటపంబెల్లఘుంము మనంగ్రంమునకొనెదమ్యోడవినుకె. పునును కెంపుసొంపులతో నెదురుపడగలవిడికెం పులదెలువగు చిలువరాచకొదుకులచేత నొక్కరత్నసింహాసనంబుంబట్టించుకొని భూదేవినాగకన్యకాక్ర మకరాంభోజ రాకద్దవళచామరమరుచ్చలాచలనీలాలక జాలకంబులలికఫలకస్థలసిస్థుల కస్తూరికాతిలకంబుతో జెలికారంబుసల్పుజలువ వెన్నెలలసొలపుం దెలుపుమవ్వంపు చిరునవ్వుల తెలుపురదసకుందకొరకబృందంబులతోం బొందొనర్పరతిదర్పకమణిదర్పణ ప్రభలనెక్కసకెంయిలాడుచొక్కపుచెక్కులప్పైపుల కొత్త క్రొత్తలముత్యాలకంబెడాలుపిడ్డింబునూపవిద్యాధరకుమారి కాపరిమితగద్యపద్యాభికర్ణ నానునోధ కర్ణోత్సలామోదసమోదసంచర చ్చంచరీకచంచత్ఝంకారంబులు మీరమేరు మందరశిఖరోపరిస్ఫురి తారకావారకంబునంబొదలుచుం గుచోపరిదేశంబునహీరహారంబులు వెలుంగమెఱుంగుతీగలతో నొప్పుపులకు కప్పుముసుఁగు తెఱుగునందురంగలించు బంగరువిరులసరులసిరులతోంగొప్పగీల్కొప్పు మిఠారించు మిన్నుజిగిదు లకించుమంచి బురుసాచీరసరిగంచుల కించుకించుక మించు కళుకుహొంగిలుకు మెట్టియలరవళినవలంబించు పదకజరం జ తర్గంతరాగమణి పుంజపింజరితమంజీర సంజాతశిరజాధ్వనులు నిజాగమనంబు సభ్యులకెఱింగింపగించిదవ లగ్నలగ్నకాం చనకాంచికాసంకలిత మణిసంకీర్ణ రవంబులు పాణికంకణ క్రోంకారంబులకులంకె సాటుపాటింప సాటిలేని శృంగార విలాపచాతురితోంగూతురికి సాష్టాంగకరించి చేరవచ్చి మచ్చికమెచ్చి బ్రుచ్చికౌంగిలించి సేయంబడిగి కన్నీరు మున్నీరుగా వగచుచున్న యప్పుత్రినమనయించుచు దల్లి యేలచింతిల్లెద నీ వెవ్వారికిందయు వగతిందప్పించవచ్చునె యారడెల్లునవనియసిమిష కన్యకాకరకలితకనకకలశవిలసితభోగవతీ సలిలంబులముఖప్రక్షాళ నంబుగావించి కస్తూరిబొట్టు బెట్టి కొప్పు చక్కగసవరిం

చిమందారకుసుమమాలికలుదుఱిమి దివ్యాంబరాభరణాదులనలంకరించి ఘనసారగంధసారకాశ్మీరకస్తూరికాది పరిమళన బులలందిసిద్ధభామినీసమర్పిత కర్పూరనీరాజనాదులవిరాజమానయగు నంమానవతినసమానమణిపీఠంబుపైనుంచుగొనినం బుగడలముంచుకొని గంధర్వచారణయక్షకిన్నరపన్నగబాలికలు డపంబుసురటిగిండెకాళాంజిమొదలయినవి ధరియించియూడిగంబులుఘటించ నచ్చరలునటించ నింద్రాదిదేవతలు మందారకుసుమంబులఁ గురియించ శంఖమర్దళపణవగోముఖడక్కాహుడుక్కాదివాద్యఘోషంబులు మించ భుజంగపుంగవులు బంగరుబెత్తంబులూని బరాబరులొనరించ రసాతలంబునకుంగొంపూయెనంత మహాప్రభావంబునకు నద్భుతంబునొందుచు బ్రహ్మాదిదేవతలందఱుం దమలోఁదమరు జగతీనందనపాతివ్రత్యప్రత్యర్ధమ్మంబులనభినందించు వెలుంగులు నంతరంగంబులుగలంగి సీతాంజనగూర్చి విలపించు సభాసదులయాక్రందనధ్వనులు నేకీభవించి భూనభోంతరంబులాచరించె నంమహాకలకలంబున నేలంబడిపొరలి యేడ్చువారు నయ్యయ్యో శ్రీరామభద్రుని యర్ధాంగలక్ష్మినేటితో మాస్వామి నెడబాసి పోయెఁ దేయని బిట్టు గాబ్రలాపించువారు నేమియునలిలేకశోక వ్యాకులతేంద్రియులయి బూర్ఛలమునుంగువారును నీలోకాపవాదంబింత చేసెగదాయను వారును సిట్టి మహాత్ములా లనట్టులాడిన యీలోకులకొక సత్యంబున్న దేయనువారును నక్కటా తల్లి తేనిబిడ్డలయితి రేయన్నలారా యనికుశలవులంజూచి వగచువారును నవకన్యకవచ్చినిలిచినచోటు గాంచి పలికినపలుకులువర్ణించినపోయినపోకఁదలంచి పలికినజేపల కుచుంబిలుమాఱుంబరితపించువారునునిదిగో కన్నులఁగట్టినట్లున్నదిది యజ్జగన్మాత నేరీతి మఱువవచ్చుననువారును నంద ఱనే మాటలబడివినికి వేసని ఈసరసిజాక్షిలోకనిందబాపికొని కారణజన్మురాలుగావునమహనీయ పథంబునకుజనియెదత్ప్రభావం బెవ్వరికయినం దెలియకక్యం బేయనువారునునింత యద్భుతంబెక్కడగనివినియెఱుంగమనువారును నౌదలలువంచియవిచ్చివ్వాష్పజరధారా పూరితనేత్రులయి వెక్కసంబుగా నెక్కివెక్కి యేడ్చు భరతశత్రుఘ్నశత్రుఘ్న సుగ్రీవాంగద హనుమత్సుషేణనలనీలజాంబవ ద్విభీషణవిభీషణ కేకయరాజ ప్రముఖులంజూచి వగవుచు క్రొత్తలై చిత్తంబులుతలంబు లొందనందం దల్లడించు వారునున ఘోముఖుండయి చేష్టలుదక్కి చేష్టవిడియున్న యన్నరేంద్రచంద్రునింజూచి పురపురంబొక్కువారును నంతస్తాపంబునప్రుక్కువారును దాలిమిదక్కువారును నయి పెక్కుచందంబులనం నయిదొరటిల్లరయ్యాస్థానంబు శోకదయిన్యనిధానంబయియొం డెనయ్యవసరంబున॥ మ॥ జనకక్ష్మావరకన్యయిట్లు మగవిశ్వంబంతయుఁ జూచుచుండఁగ నద్రోచిన దీనభావదరక్షాధైర్యంబుపో

(*) సీతాదేవిరసాతలంబునకరుగుటకు రాముడు చింతించుట (*)

నాడిబో । దనపంకేజములప్రు ధారమునుగఁ । దృష్మభర్తహాజానకి । యనుచుఁ బొరొర్భిల్లి క్రమ్మంబందెలిసిశోకాక్రాంతుడయియట్లనఁ॥మ॥ జననిందంబడలేకనీన్నాకరివనవ్రాంతంబుతోగానవం । బునద్రోయించినతప్పబాలకజగంబుల్వాపిశోకింప్రగిం । నిచంధంబునరచ్చనెట్టిపెనటుంచుఁ బాగినెటుసోంచు । వుచనేడింకొకసారినీనగుముగంబుంజూపవేజానకీ ॥ మ ॥ అకటానీవుపతివ్రతామణివి నాయందెంతయుఁ గూర్మిబా । యకవర్తింతువటంచుఁ మ్మితిగదే యర్ధాంగనీవున్నచో । టికినన్నుఁగగానిపోవకనిర్దయుల నొంటఁ దించిపోవందలం । పకనానేరముఁలిందువచ్చునిబునే మాటాడవేకోమలీ॥మ॥ సదనంబుంబెడవాసినీవు బహువర్షంబుల్వనక్షోణిజెం । దిదురంతవ్యధలొందినమ్మ వసురక్షింగూడివర్తింపఁగాఁ । నిదిపేసదయునయుపాయనంచుశపథంబెగోరితింగానినే । హృదయంబించుకైతేఁగినందలతునే యీమాటప్రాణేశ్వరీ ॥ చ ॥ అడరెడుచిచ్చుజొచ్చితరి నాపటనూరకచూచివాటని । లక్కడయామాగానద్రోచి చిరకాలమెండాలిన బెట్టితిదంబు । మెడగనివంతలన్నిసికినీయానతికొక్కడిమోహమంచుని । పృథమిపదంగిపోయిపోనివేమేపతివ్రతామణీ ॥ ఉ॥ కన్నులసారెకుఁ దొఱుగుకజ్జలసమ్మిళితాశ్రుధారతో । వీన్నదనంబుతోమిగుల వెచ్చనియూర్పులవాడుమోనితోఁ । జిన్నిమొగంబువంచిబలుసిగ్గునగేల్లగవమోడ్చియుండుని। న్నిన్నునినుండలంచుకొన సూహగలంగెఁ జేవభూమజీ॥ చ॥ అనిశమువానలూరువజనాంతరవాసముజెందినావునీ । పెనశినప్రేమసంగదినెదెప్పటిప్రేమమనుగూడియుండుమనం ।, చుమనొకయానబట్టుకొనిప్రుక్కపెక్కుదినంబులోర్చితి । న్ననుదిగనాడియిట్టుచనిన న్వేతనెట్లుభరింతప్రాణముల్॥ ఉ॥ ఎక్కడికిప్పుడేగితిడో యెక్కడదీనతఁబాసినిన్నిఁనా । వెక్కడబోయెనాటిమరు తెంతగృపారహితాత్మురారిక్రై । తెక్కడజొత్తునేదితెరు పెక్కరణంగ్రమియింతుకాలమిం । కెక్కడనున్నదానవనియె వెదకింపుదుబంకజాననా ॥ సీ ॥ దప్పించిపరమేశుధన్వంబుచేయుచుట నిమిత్తమెకదే నీలవేణి । యేలమితోఁగపిరాజుచెలిమిపాటించుట నీకోసమేకదే నీరజాక్షి । విబుధేంద్రుసుతుఁబొంచివ్రేసినిర్జించు నీరాకకేకదే నిర్మలాంగి । క్రోధించిసాగరక్షోపంబుసేయుట నీపనికేకదే యోపురంధి । బ్రహ్మాకులజునిబొల్పస్త్వపతిగెలుచుట । నిన్నగైకొంటకేకదే యన్నిలాడి। యకటయెవియెల్ల నెంచకనొకటిరెండు। గస్తులకునున్న నెడబాయఁదగునె సకి॥సీ॥ పడతిదీకటసీనుయిడుగుబట్టుట జేసి నేలగ్రుంగినయట్లు నేఁడుదోఁచె। జెలువనిలెగొనుబలముదూలుట జేసి సింగగూలినభంగిభంగి నేఁడుదోఁచె। నలినస్నీముఖచంద్రుడస్తమించుటఁ జేసి నికిలంబుతిమిరమ్మై నేఁడుదోఁచె । సఖియనీకాంచనాంగకమడంగుటఁ జేసి నిబిడదారిద్యంబునేఁడు దోఁచె । భామనీమణినీపొందుభల్దేమిజేసి । యింతతవిజ్ఞన్మమిక వర్ధ్యమనుచుదోఁచె । జలజనుఖినీవు వెడఁబాసి

చనుటఁ జేసి। యుదిగొనియన్నియుఁ గోదువలై యిప్పుడుం దోచెక్॥ క॥ నీగౌరవంబు సీయను। రాగము నీమైత్రి నీపరభావంబు। న్నీగరువతనము నీదయ। నీగుణముల్ మరువవచ్చునే యెన్నటికిక్॥ ఉ॥ నా మనసార యెంతకతనంబో తలోదరి నీవు సత్యభామా మహిమోన్నతి తన్నహో యొనంగిన త్రోవన హేంద్రకన్యకా। చామరచంచలచ్ఛికులజాతకవయి చనజూచి పస్సిపో। జేమియుం గామరాతివలెనే బెలువా దేమజూడుమి వ్యోడక్॥ మ॥ అనిసీతా సతినాత్మ మంచి తొలి మోహంబెంచి శోకించియు। య్యినవంశాగ్రణిభూ

(*) రాముడు భూమిపై బాణము ప్రయోగింపఁబూనుట. (*)

మివచ్చి నిభవంబె పారసియ్యంతినో। దోర్దండనిపాతాళబిలంబు జొచ్చిన తెఱంగున బుద్ధి నూహించి మిం। చినక్రోధంబుల సభ్యాలంగనివచు స్పెన్వార్షి కాబ్దన్వసక్॥ ఉ॥ కంటిరె సజ్జనులార జనకప్రభుకన్యక వేఁడుకొన్న చోఁ। బంటువలెంతి వచ్చి ప్రియభావముతో వెతదీర్చిపోక తా। కంటుసనన్నొకింత యెముతైకొనకల్పునిగాదలంచి వాల్। గంటనలంకరిన్పు కొని గ్రక్కున దోకొని చన్నచన్నదముల్॥ ఉ॥ బాలతనంబులీల నేను బెతపాలయిదీనత గాసిలంగనా। పాలిటిభాగ్యలక్ష్మి నను బాయనిజానకి గొంచుఁబోయెని। న్నేలపడనిముండగమనీతియుఁ జూచితి రేకదాయిఁకం। బాళిమిఁ బూమియత్రయసదండన సేయక తాళవచ్చునే॥ చ॥ అవనపయోధిఖేయ మగులంగకుంబోయిదశాస్యముఖ్యులక్। బరవములో జయస్స్విమును భూమను దెచ్చిననాకసాధ్వమే తిపిరిధరిగ్రొన్న సుధతిక్ మరలిచ్చు మాటఁడిన్నటుక్। భువనము లెల్లభీతిలఁగ భూరిశరాహతి భూరివచ్ఛేదక్॥ చ॥ దురుసుగ నామదింగినుకథాపము నరసీతఁ దెచ్చియి। ద్ధరణ మెయిసంగినక్ బ్రతుకుఁ దక్కినవాముక చాపముక్తని। స్ఫురవిశిఖప్రతాపముఁ జూపెడమున్ జేసియజాండమెల్లనా। వరుణపయోధిలో గలపివైచెదనో క్షణంబులోపలక్॥ వ॥ అనిహిరణ్యగర్భస్వచ్ఛవనాదివాధప్రముఖ హావిర్భుజులకు గర్భనిర్భేదంబు గాఁబలికి వెతనపలుకుకులకతుకులేక నిరాకులస్థితిం బ్రవర్తిల్లు ధాత్రీమీఁదం బుట్టిన జెట్టినం పురోషంబునం బెదవులదరనిడాదకన్ను కేవలచెడిదంపు మిడుగురులు లెదరటతగంగటతట బుఁ జెలింపము నిక్కప్రటమ్ములప్రకటతరోష్ణవసనమ్ము విజృంభిస్పటలతమ్మున నతివికటభ్రుకుటిఘటిల్లరదనపటమ్మునం బటపటార్భటులుప్పతిల్లబురుహారుణరసోన్ముఖంబై ముఖంబు జేపురిమ్పునె మ్మోనంజిఱుచెమ్మటల తెమ్మెలాపరింపఁబ్బధాత పలయసమయసముదండతాండవక్రీడాప్రచండచండీశ్వర విస్ఫభయంకరకరణపారదృశ్వశశ్వద్విశరసోల్లాసంబున నావాసంబొసంగి వాసవారవరప్రాసాదవిరాసలరాసక్రియయాసమల్లసమ్పరత్రయహరణకారణరణారంభశుంభశ్చంభుకరశరాసన విముక్త ముక్తాత్రవిశిఖాని వార్యకార్యంబులో నాహవర్యంబువాటించయనారిస్థైర్యధుర్యతాంకతు దతమధువిభాతప్రభూతసముద్రేకతాత్మురుద్రరౌద్రనిర్నిద్రవిరభద్రప్రభావంభావహించి భాభవాబ్ధిగర్వసర్వతో నస్వాలనఖేలనంసాలనచటులవిశాలధాత్రీస్థలకీలికాఖిలప్రశియకాలప్రద్యోతమాన ద్వాదశ ద్వాదశాత్మప్రతిప్రతాపరీతింబడిపించి యపారపారావారవారి పూరపరాహారక్రీడాడొకమానబడబానలశిఖాప్రకరతి ప్రతరోష్మంబువధిగమించి యనవధికనకభువనాక్రమణప్రవర్తనాతివతుఁ దవర్తసంవర్తసమయాంభోనిధాన గాంభీర్యంబునంబొలుపుమీఱి భూరివిశ్వంభరాభారభవణప్రవణఫణికులేశ్వరముఖనావాస్రజయుజ్యమాన పవమానాశనభిషమజ్జాతనంకేతఘ్రాణమూర్తి బింకంబున భయంకరుండై సకలప్రపంచంబునొక్కటనుకరండంబిదిగ్రమింగనవ్వళీందువిలయకాలమృత్యువు మహోద్ధత్యంబునబొంపిరివోవుచు నఖిలజనములగ్రమ్మకొనిదుంము సేయనుద్యోగించు ప్రళయకాలజంఝూసమీరంబు తెరున బలిమింజెఱువారి యెవ్వారికి జేరిచూడరారకోపంబు రూపంబుగైకొన్నకోవునసహాంకరించి హుంకారంబు విన్వల్లనివ్వెరాదిపీరుండు రూక్షరనిరీక్షణంబులు నిప్పులుకుప్పలువడకప్పడమి నట్టెయవలోకించి కించిజ్ఞవైజడమతిసన్నింగొంచె గాసింగాఁదలంచి నీతింజూడఁబోవ జెరువయినవో సంగతయితివిశదామంచిచి యాతుణంబునదిన్నినిర్భేదించి నీగర్భంబున నున్నయతలవిడలాది సప్తసాతాళలోకంబులు చీకాకుగావించి నీవుధరించిన సరిత్సముద్రగిరిపురగ్రామతనకానన నాడులతోడ నీయందుగల నిఖిలజంతువుల నిర్మూలించి నిన్నుభరించినకులపర్వత దిగ్గజభుజగవరాహకూర్మాదులనింతలింతలు తునకలుగానొనరించి నోటితోనియెడలోకంబుబు నీరుగావింపెదంనాళుమను చెంతనున్నలక్ష్మణుచేతి శరాసనంబునొడిసి పుచ్చుకొని యుచ్చరంబు హెచ్చనచ్చాకంబు మిక్కుటంపుటుక్కన నెక్కువెట్టి కోట్టుగారా రిసారించిస్సైరించరానితద్దీర్ఘనిర్ఘోషంబున బీసుబ్బవారిటుక్కలు ప్రకటలయ్యెఁ బుకటలు నేలపాలయ్యె సముద్రంబులు పంకిలంబులయ్యెఁ బరత్వంబులొడ్డగెడపులయ్యె నాదిశేషుండయ్యె నజాండభాండంబు పగిలినట్లయ్యె దిక్పాలురు దిగులుంజెందిరి దేవతలు నెగులుంబొందిరి కిన్నరలు ఖిన్నతవహించిరి కింపురుషులు కంపించిరి సిద్ధులుచే। ద్పాటునొందిరి విద్యాధరులు వికలతంగుందిరి గరుడులు గాదిసీకతవహించిరి గంధర్వులు కళవళించి విత్తుళితులు దుఃఖించిరి బాస్వరులు పరితపించిరి యక్షులుదొలంగిరి రాక్షసులు కలంగిరి నరులు మూర్ఛిల్లిరి వానరులు తల్లడిల్లిరి వసువులడలిరి మహారాజికులు బెదిరిరి నిజరుకౌదిరి రాదిత్యులు బెదరి సూర్ధ్వలోకంబులను గ్రాంధకారంబులు నిండుకొని యెనురగలోకంబు సనుద్వావొంబుల పొందుకొని యునట్టిసమయంబునం బ్రహ్మలోకసాదుండై కావత్సుండు చండకోదండంబున గాండప్రకాండంబులు తపిగిభూమండలంబున నేయందొడంగు కడకయెటింగి యుత్సాహంబుదొరంగి గడగడవడంకుచు వెడవెడఁగొంపుచు బొంకజాసనుండరు

జాసనుండరుగు దెంచి యయ్యయుగుణాఢ్యుని హస్తంబులు పట్టుకొని యఖిలదేవర్షి బ్రహ్మర్షి గణసమన్వితుండై యిట్లు యభిను

—(*) బ్రహ్మాది దేవతలు శ్రీరామునిస్తోత్రము సేయుట. (*)—

తింపదొడంగె॥ చ॥ జయజయ సాధురక్షణవిచారవిచక్షణ సారసేక్షణా । జయజయ సర్వకారణ నిశాచర దారణ కృష్ణహారణా। జయజయ సత్వభావనిసుజన్యసుభావ లోకపావనా । జయజయ మంజుభాషణల సత్కలభాషణవార్థి శోషణా॥ సీ॥ తనవిల్లు విరిచినట్లు నెరథంబును ద్రుంచగడఁగెగాయనుచు శంకరుడు వలికెదమ మేఘులాలీల దాల్పు। ధారమారత్నమడగుచున్న దెయంచు నబ్ధిగలఁగె । నిజధరాధరిసంజ్ఞ నేటితో దక్షమయ్యెనొయంచు జలించె బుడమి దాల్పు । లికనేమిగా వింకు మెందుజొత్తుమటంచు ఫణి ఘోణి కూర్మముల్ పరితపించె । నొకధరాదేవితో బోనెసకలలోకసముల దుజెడు కాలమొదవెనంచ భీకుజెంది। రెల్లలోకులు నిదేతవిల్లు పూని । ధాత్రిగను గొన్న మాదసీతాకళత్ర ॥ ఉ ॥ భూజవహ్నివాయువభముల్ మహాబాటులు సృష్టి జేసిని । వేజగదంతరాత్మనయి నింతకు నాఢ్యత జెందినాభిపర । కేజమునందు నన్ను గలిగించి తెపెంచితివి ప్రపంచమున్ । రాజవేషివు వమ్మారయురాజవుగాక త్రిలోకవందితా॥ ఉ॥ కారణయుక్తినీవల నగల్గి లెరాకమునీ వెత్రుంచెనె। వ్వాదము గాదటంచ నెదువారది మెవ్వరిదిట్టి ధాత్రిపై మేరి మెయింతకోపముశమింపుము గాంచి ముమూదిమానసా । గారవిభాసి దీపరుచి గాంచి వెలింగెజి సిస్వభావమున్ ॥ శా ॥ సత్తామాత్రుడవై ప్రపంచకలనా పాతుక్షిశ్వధుర్యుండవై । సత్త్వాదింద్రియబోధరూపకుడవై సచ్ఛక్తియక్తుండవై। తత్తాదృక్తిగుణాత్మకత్వమున నేతత్సృష్టి రక్షాత్యయా। యత్తానంతవిలాసలోకనని వ్వాదృశ్వి లెరాకింపవే ॥ అనిపలికి మతియునిట్లనిరి॥ సీ॥ కల్పక్షయమున నేకంబైన జలధిపై బవళించి పగదిచ్ఛ యవధరించి । హృదయాబ్జమున నన్ను సృజియించి నీగ్రమించుటకు బొందమ్మిబొకల్లుటిగటంచి । బయలు దేరినగోదపంబు సేయుమటంచు । నాకాశమూర్తివై యావృదుపల్కి । తపమునీష్టకు మెచ్చితగనంచవయి వచ్చి తెలయనంతయు నుపదేశమిచ్చి । వెనుకవయికుంఠమను పేరవినుతికెక్కు । భువనరాజ్యంబు లెరాశేషభోగితల్ప । శాయివయితొ చినను జగత్స్రగమునకు। నియ్యకొలిపిన నాతండ్రి నీవె కావె॥ మ ॥ శిఖివిద్యాబలశౌర్యపణ్యకృభిసంసేవాదులంగూడినీ । ముఖబాహూరుపదంబుల గ్రమమునంబుట్టించె జంతూర్వర్ణముల్। నిఖిలాశల్ జనియించెనీ చెవులనిన్నేత్రంబులన్ గల్గిరిం । దుఖరాంశుల్ జగదంత రాత్ముండవు నిన్నున్ శక్యమే యెంచగన్॥ మ॥ జనముల్ భ్రాంతు మొందబ్రాకృతునియోర్జదైత్యాశోకక్రుధ । ల్జను నేయిట్టు వహింపజాలు యెడమిగ్బాసంబభూ జెవిచే । సినతేప్పిమిత్వదాజ్ఞగాదె తెగవిచ్ఛిన్నితసిత్యాపహా । యునిన్నుంబెడవాసి యెందరిగెనంద్రీబుద్ధిసీవింపుమా ॥ ఉ ॥ సికతలాడియుండియునేప్పలరకాచియుంచినావా । ల్మీకిమహర్షి యక్కొడువలెస్సవినందగునందునన్మనో । వ్యాకులతాస్థితుల్లాలగు నంతయు గాదు భవివ్యదర్థము। న్నికెటుగంగవచ్ఛనది నేను నావింటిమునీంద్రకోటితోన్ ॥ శా ॥ శారప్రజ్ఞఘటించు శ్రోతిలకభీష్టంబుల్ ప్రసాదించు భాగీరధ్యాపగబోలి పంకమడగ్ గర్భాబ్ధి నీపాదమం । జీరస్మారమ్మృదుధ్వనిం జెవులకుంజేకూర్చునల్లాసము। శ్రీరామాయణమాదికావ్యముసుసీతాపనోవల్లభా॥ క॥ తత్తరమొందకయి శరీ। సు త్తరకాండంబు విన్నను త్తలమడగుం । జిత్తము ప్రసన్నమగు సని। యుత్తామరచూలివలుక నాంగాకనుచున్॥ గీ॥ కోపము పసంహరించి కాకుత్థ్స మౌళి । యమజు చేతికి శరశరాసనములొసగె। నలరి యవ్విభువీడ్కొని యజుండు సురసులు । మునులుగొలువంగ దనలెరా మునకుజనియె॥ క॥ ఆసమయంబున గాంక్ష్యము గీసీనగతిసతులువల్లకీ తతలొకసై। మోసినగతి నెలుగడరన్ । భూపతి కనుండి యొక్కడు డివిదబడియెన్॥ శా ॥ రామాద్యోర్వ చింతేయె మిటికిశ్రీరామాశిరోరత్నమే । భూమిన్సీతయనన్ జనించి హరిపై పొల్పొందునిన్ గూడెసి। వైముఖ్యంబు తుదిన్ సహింపక బుధుల్వర్ణింపనాత్మీయామా । ధామంబుం దొరసెందదాగమనమూర్తుం గోరుచుం ద్రెబ్బడిన్॥ చ॥ క్రియమున వేధయున్ ధృతియు గీర్తియుశక్తియుహ్రీయుశాంతియున్ । మయామయను దృష్టిభ్రష్టియును నిత్యముసీత యెరుమ్మతననో । దయితుడవైన నీ వెనరదైవము విన్వరుమీరు తల్లితండ్రియునై లెరాకరక్షయొనరింపుచునుండురు రెల్లకాలమున్॥ శా॥ ఏశివంతిసి పాదశోరణచి దేవేంద్రాదిదిక్పాలకాం । తాసిమంతములందుఁ జెందిరముచాదంబొందు నేచెవిపి। తాసమ్యగ్యతిలేకమద్ధ్విజః దౌర్గత్యంబు మాయుందునా। శ్రీతాసతిపిలినిన్ను భజియించెన్ రామకొన్నాళ్ళిలన్॥ ఉ ॥ సీతఁదలంచి యింక వెతఁ జెందకు శ్రీరఘురామ యామెపై। నాతతమైన నీకరుణ యంతయునిక్కనలందునిల్పు మా। జ్జాలభవోపదిష్ట ఉ గుపద్ధతి నుత్తరకాండమాలయున్। బీతిదళిర్వనీకువిను

—(*) రాముండశ్వమేధయాగంబు బరిసమాప్తినొందించుట. (*)—

వించరహస్యమనుచుఁ దెల్పినన్॥ ఉ॥ ఆపలుకుల్ చెవింబడియంతనొకించుక ధైర్యమూనియా । త్మాతత శాపలూరుభవుగన్గొని మీనుదువుల్పింగని । తాపసులిన్నృపాలకులుఁ దద్దయు గోరుచున్నవారికి। నేపటునులడియుం। బ్రయాణమునివ్వటిలంజడవింపుడవ్వలన్॥ క॥ అనిపలికి సకలజనముల । ననిచిన నెయ్యమునని చినందనులం। దోడ్కొనిముఖశాలకు జనియె। స్సానుకులవణియంత గగనమణియునుగ్రుంకెన్॥ ఉ ॥ ఆనిశిమెల్ల జానకిగుణాతిశయంబు లేచింత సేయుచు । న్మానచభర్తృస్ద్రయను మాటయెటుంగకెయుండివేగినన్ । స్నానము సంధ్యయుంజపము జన్నపునేమములన్ ఘటించియూ । స్థానము జేరి బ్రహ్మరుషి సంగమతోవసియుంచియప్పుడున్॥ గీ॥ సుతులఁగనుగొన్నవల్లకీశ్రుతులజెనయు । శ్రుతులశింగయతులు భూపతులు మెచ్చ। గతినయదిన్నంబు

ఉత్తరకాండకథలు। వారుతుదముట్టజదివిద్వరమునవ్వ్యా॥ ఉ॥ అతఁడిబుధ్విగావలికినంచినదక్షిణలిచ్చియర్థిసం । భూరిముదో రినట్లుకుతుకంబుననీవులొసంగిధారుణి । నేతలదానవేంద్రరజనిచరముఖ్యులభూషణాదులం । బ్రీతులఁజేసివీడుకొలిపెంబతి యుండఁజనర్హరీతులన్॥గీ॥ ఇటులఁగృతకృత్యుఁడై రాఘవేశ్వరుండు । ధరణికన్యావియోగాగ్నితప్తహృదయుఁ। డగుచునసుజు లుఁదనుజులునావులార్యు । లాశ్రితులుఁగొల్వగనయోధ్యకరిగియచట॥ఎ॥ నయమార్గంబునరాజ్యమేలెనవనీనాథుండు దేవద్వి జ । ప్రియకార్యంబులొనర్చుచుంజగతినై దెక్కగ్రహారంబులు। న్భ్రియసంపన్నతఁగల్లఁజేయుచుదురాచారస్థులఁబావుచున్ డయనర్థార్థులకోరుక్కలిచ్చుచునధానశ్రేణిరక్షింపుచున్॥నాజియనుచు॥సీ॥ అమితదక్షిణలతోలయుతాశ్వమేధముల్గావకొనిరొము సరించెఁగొన్నినాళ్లు। శిష్టులౌననఁగనగ్నిష్టోమయజ్ఞముల్గురుడుష్టనొలరించెఁగొన్నినాళ్ళు । భూరిదానములవిప్రులతృప్తిగన నేకగోమేధములానర్చెఁగొన్నినాళ్ళు । జేజేలలరభక్తివాజిపేయములు ఋక్కటవుకల్మినొనర్చె గొన్నినాళ్లు । లెదతెగ వియాహుతులనువహిస్వాకినజీర్తి । యడరనతిరాత్రిపొండరీకాదియాగకోటులుఘటించెఁబటుబుద్ధిగొన్నినాళ్లు । హేమసీ తాసమేతుండై యునకలుండు॥చ॥తొలువరసీతవంటినతిపోయినవిమ్మటనింకనొక్కతె । న్వలయునెపెండ్లియాడననివారనినెం బలినెవ్వరెన్నిభం । గులవివరించిననృపనకట్టోజబోలినసైడిమెన్మని। శ్చలమనిజెంతసుంచుకొనిత్స్మావతిసేసెననేకయాగము ల్॥ తతొక్కలంబున॥ సీ ॥ అవనివసుంధరాఖ్యకుచదగనైడలేనిహేమరావలకాంతినెసకమెసఁగి। వనధిరత్నాకరత్వముయథా ర్థముఁజేసెబలుతరంగలరత్నపఙ్క్తులూని । యభ్రనామముపోవ్యను మునిరూపముగఁతాల్చె జనులుగోరినవస్తుసమితిగురిసి। ధర్మాభిదానమంశమందునిక్కమునర్చెమునసత్యమైననుగడియాఁబోక । వలసినవుడెల్లవానలుగలిగియుండె । ప్రబలిరందఱు బాడియుబంటలెవసి । నెట్టకొనికొన్నిపోకలుబట్టెడమ్మ । శ్రీరఘుస్వామిరాజ్యంబుసేయునపుడు॥క॥ తరుణికులాధీశ్వరున కుఁ।భరియింపగనవుడురెంసుభారములొదవెన్ । ధరణీభారమునుసీతా।తరుణీచిం విరహభూరితరభారంబున్॥చ॥సుజనగనే ర్చులొకులదమస్థితిజల్కినయట్టివిందలు । న్మరువగనేర్చునాశ్రితులుమాటకికోసినయన్నితప్పులు। న్మఱచినమఱపురాకమదినా టినసీతవియోగదుఃఖమున్ । మరువగనేరడమ్యోగుణమండితుడారఘునీరుజమ్యోడన్॥ సీ॥ విద్యావయోరూపవినయశౌర్యా దులబ్రబలుతైకొలుకులుభక్తికలుప । హృదయానుగుణముగాసేవరకేవేళ ననుజన్ములఖిలకార్యములనడుప । సకలదేశా ధినాయకులుగింకర్యాణుతైపదాబ్జములెప్పుడనుసరింప । హితమంత్రిగురుపురోహితబంధుసామంతముఖులుమనఃపూర్వము గనుతింప । భూమిజిరకాలమేలుమాస్వామియనుచు । ప్రబలుచేపట్టగలిమియుబలిమిగలిగియొప్పియుండియుసీతలేకున్నకత న।నన్నియుగొలంతనైతొచేనవనిపతికి॥ గీ॥ ఏకతంబుననున్నచొరవకులుండు । భామినీమణిపూహించిపరితపించుఁ । గొలు

——(✽) కౌసల్యాకైకేయీసుమిత్రలు దివంబున కరుగుట. (✽)——

వులొనున్నయప్పుడుకొడుకులగని । సీతరూపంబుభావించిచింతనొందు॥ సీ॥ రాజ్యంబుజేయుశ్రీరామునివిభవంబు కన్నులు చల్లగాగాంచియులరి । యమితదక్షిణలతొనాతఁడొనర్చినయాగకోటులుగనిపూర్ణమొంది । యత్త్యయంచునపర్యలాచరించుకు శాదిపౌత్రులగనుకొనిదాళిజెంగి । సీతపోయినచింతజెందనికభజించుసూర్మిళాదులుజూచియాఁడల్లి । చెల్లబంధులపోషిం చియుహాసుఖంబు । లెల్లగనినదతులయుల్లమలర । నడిచినన్నగౌసల్యానాథుడున్న । లోకమునకేగసుతులెల్ల శోకమొంద॥ అప్పుడు॥ క॥ తల్లీసాధ్విలోకమ।తల్లిమముబాటిపోవందగునేయనుచిం । దల్లడమందుచురఘుపతి । తల్లికిబరలోకవిధులుతగ నొనరించెన్॥ చ॥ పతికటకామెచన్న యొకతుముంలోపలనేగగకయ। క్షితిపతిపుత్రియుస్స్వభునిచెల్మికినంతటి లోగ్రమంబు నం । గతిపయనాసరంబులకు గాంతునిజేరెసుమిత్రయన్నయ । ప్రతలిపినన్నశత్రులు పరస్పనిసౌఖ్యములొర్వరమ్యోడన్॥ అప్పుడు॥ క॥ ఆమాతలగూర్చిరఘు। గ్రామణిమహీసురులగొనగరత్నాభరణ। స్తోమంబులుహేమంబులు। గ్రామంబులుబా రలౌకికక్రియలమొడన్॥ చ॥ అతులవిభూతిమించిత్యయజ్ఞములిట్టులొనర్చిరామభూ। పతియనుచిత్సమందొరగిబంధుపురో హితమంత్రిసోదరా । న్వితుడయిమొక్కనాడుమహనీయసభంగొలువున్నకేకయ। క్షితివరుడూతవచ్చినతిజేసి కరంబులు మోడ్చియిట్లనెన్॥ గీ॥ స్వామివారికడనుమీమామతనపురో।హితునిబంపెవాఁతడిదిగోవచ్చు। చున్నవాడునేను మున్నగాదె

——(✽) రామునికడకు గార్గ్యమహాముని వచ్చుట. (✽)——

లుప। వచ్చితినటన్నృపతిశేఖరుండు॥ చ॥ అలరుచుగేకయాధిపతియంపినగార్గ్యనికిన్వసితిమె । చ్చిలనెదురేగివందనముజేసి నధీరతనిల్చియాతడు । న్వలపితలిలమించుపదివేలహయంబులరత్నభూషణా । వళులధనంబులన్వివిధవస్తుచయంబులొసంగ గానరాగన్।గీ॥ అవిపరిగ్రహించియివియెలదెచ్చితిఁటింతవింతచేతుకేయటంచు । వలసిదొడితెచ్చియర్ఘ్యాదులిచ్చియర్హాసన మునసుంచియథివడనిమొ ॥ చ ॥ లలితగుణాబ్ధిమీకుసుశలంబెకరాఘునుడన్మదీయమా । తులుడుసుఖంచునేవినయ దోహలు డాయనతండ్రివైభవో । జ్జ్వలుడయియున్నవాడె శుభవంతులెపుత్రులుగూర్మిమాపయిం । గలదెస్వదాగమంబునకుగార ణమేమిగణింపవేచుసన్ ॥ మ ॥ మృదువాక్యవిచుడమ్మునీంద్రుడనియెన్మీమాతులుండయ్యథా । జిధిలాస్వరుచార్యబం ధుయుతుడై క్షేమాననన్నాముప్రే । మదలిర్పన్శుద్ధశీలురన్మిము బరామర్శించుసన్పంపెవా । డదిగాకిప్పుడొకవార్తదెలుపమని.

నాడావింపుమర్వీశ్వరా॥ శా॥ గంధేభప్రతిమానవిగ్రహులుదగ్రస్యందనుల్బాహుగ్ర । ర్యాధుల్ సింధుల్ టోభయాశ్రితులు
మాయాయుద్ధబద్ధాశముల్ । గంధర్వుల్ శరచాపధారులు ప్రపక్ గారింపుచున్నారుడు । స్సంధుల్ వారలబట్టిజంపిబుధులక్
సంరక్షసేయందగుక్॥ ఉ॥ ధారుణికిక్ భరంబయినదారుణచిత్తులసంహరించినక్। భూరియశంబుపుణ్యమును బొందడ నేకద
నల్గురాజ్యముల్। శూరతమించుమీసుతులలోపల నెవ్వరికైననిర్వురన్వారక యిచ్చటన్నిలుపవచ్చు ప్రజావితి హెచ్చునందునక్॥
గీ॥ అనియుమీమామపనిచి నాడనిన రామాడెవ్వనికుమారుల । వ్వారులేందఱగలరనినవారెల్లమూడుగోట్లనినినాథ । అలులు
శైలూషసుతులంచు గార్గ్యుడనిన॥ చ॥ నినుకమసమ్మతించికడువీరుమగార్గ్యునిజూచిపల్కెనో। మునివరయుద్ధరాత్మలనమో
ఘశరాహలినుక్కడంచిశౌ । ర్యనీధులదక్షపుష్కరులనాన్మతనూజలనందునిల్పనా । యనుజులదారాముసిక్ భరతు నంపెదరే
పుబలాన్వితంబుగక్॥ గీ॥ విభవములుమించుగంధర్వవిషయములకు। బట్టములుగట్టబనిచెదభరతసుతుల । వీక్షణంబుననసవా

—(*) భరతుడు రామాజ్ఞచే శైలూషాత్మజులగు గంధర్వులమీదికి యుద్ధమునకుబోవుట. (*)—

లికిర్పురకును। జెలగపట్టాభిషేకముల్ సేనిపరుడు॥ ఉ॥ ఇటులదక్షపుష్కరులకిర్వురకుక్ రఘుభరసట్టముల్ । గట్టివినిత డో
భరతుగన్నొనిగార్గ్యులగొల్చి రేపెపో । విట్టలమైనబల్మిబొలియించుచమువ్వెనులగట్టుమిచ్చటం । బెట్టనయుగ్మమందులగుమా
రులనిల్పుమురమ్మునావుడుక్ ॥ చ ॥ నవినయబుద్ధినాతడు మహాసాదనియమ్ములునాట పెకువక్ । దివిసముఖోచితక్రియలుదీర్చి
కుమారులతోడవచ్చిరా । ఘుపునకు మ్రొక్కెదీవనను గాజొనిపిడొనియుదగిరి స్తవా । భయసబురసరించుకొని పౌరుష హా
ప్పజనైక్ జయార్థియై ॥ అప్పుడు ॥ సీ ॥ అసిఘోష ఘీంకారకృతవైరిమదవారణములైనఉదవారణములుగదలె ఘనఖురోద్ధర.
జోంధకారాంధహారి సైంధవములైనబహుసైంధవములునడిచె । జటులకేతనకాండచలిత తారామండలములైన రథమండల
ములుదరలె । వీతిభాగభియాతవిదళనోద్ధతిహేతికోటిఘ్నమైనపదాతికోటిపెడలె । నందుభేరీణాంధణల్ గ్రందుకొనియె। శంఖ
భుంభుంనినాదముల్ సందుకొనియె । నమితకాహళరవములు మిన్నందుకొనియె॥ శా॥ ఈలీలంబహుసేనగూడి భరతుండేగంగ
నాత్రోదలోగాల గ్రీపుడితండు సంయుమునకున్న గంధర్వమాంసాదులం । గీలాలంబులద్భుప్తిసేయుననుచుం గిర్తింపుచుక్ భూ
తభే। తాళక్రూరపిశాచకోటినడచెక్ దండుస్వలెన్వెంబడిక్। క॥ ఆలాగయినసరించెన్వ। గాలవ్యాకవ్యాఘ్రముఖవ్యాఘ్రంబులు
లగముల్ । నెనయుసింగియునెరసెవి। గొలచమూకలముపిశాచార్భటులక్ । ఇవ్విధంబున॥ మ ॥ నెలమీదలబడివేసువాళ్ళకు
మహానీకంబుతో నాత్మ । మాతులుమోస్సేరియుతదుని ల్పరహిసం దుస్సాటికిన్వచ్చి పెం । పలరంగామయనాడే కేకయసహా
హాయ్యంబురాశాత్రవు । ల్గలగక్ రామసహోదరుండు నలిమెన్గంధర్వ వేశంబుపై ॥ మ ॥ పటుహాద్వానములుక్ భటార్భ
టులుదబ్రక్రోదయోధచ్ఛటా । ఘటితేష్వాసగుణధ్వనుల్ నిజపధూగర్భైతనన్భేదనో । త్కటలీలన్నిగడందడాగ వనవార్త
ల్వెన్నవారాటనో । క్కొక్కగంధర్వులువచ్చితాకిరిలు కంగాకత్థ్సేనావలిక్॥ క॥ కడలింగడకిమెదురొక్కను । కడిమిక్
భరతేంద్రుసేనగంధర్వులపై । పడినిగుడబెడగుముగదలపడిపోరెదునపుడుపోరుభయదంబయ్యెక్॥ క ॥ నిలునిలుమనునెలు
గులుతల । తలమనియెదు నెఱుగులడరి తాకడిమేలుగుల్ । కీలకిలనార్పురెలుంగులు । భళిభళియనునెలుంగులునభంబవి
యింనక్॥ సీ॥ నడుచునప్పుడుదాసిపోడుచుచప్పుడుగేక క్రేయూచుచప్పుడుదోమ్మిసేయుచప్పు। డాగుచప్పుడు జెలరేగుచప్పు
డుగత్తులొఅయుచప్పుడుమూకవిరియుచప్పు । జెదతించుచప్పుడు బెదరించుచప్పుడగ్గించుచప్పుడుహుంకరించెచప్పు। డదిలిం
చుచప్పుడుబిదళించుచప్పుడు బిలుచుచప్పుడుబురికొలువెచప్ప । నుభయసేనలసమరితినుప్పతిల్లె । మిక్కుటపుకినుకచదలాని
పిక్కటిల్ల । మనుయోధలుశైలూషతనుజయోధ। లేదహెూరాత్రములుపోరిరీరసముగ। మతియును॥ సీ॥ చరడొహతులభూ
మిజనియించురజముచేనిఖిలదిక్కులనిర్లునించినించి । ఘళిపించువిద్యుకత్తులవల్లదుళికించుమించులదివివెల్ల ముంచిముంచి । జ
ముడుబిట్టాడించు జంతువుబొమ్మలట్లులతెజెందకత్రుపమ్ములాడియాడి । కుసుమితాశోకశాఖికోమరునగ్రొత్త నెత్తుటవాకల
మునోప్పదోగితోగి । చెయ్యొలిలయుగమూర్ఛలజెందిచెంది । యలవుకలిమినొకింతలోదెలిసితెలిసి । సింహముల లీలగర్జన
ల్సేసిసేసి। యుభయయోధులుబోరాడిరొక్కమొగిని॥ అప్పుడు॥ గీ॥ ఒరలుమదకరులుగ్వ్రాలెబోరులుహరులువిరుగుతేరులు
బలమేదిమెఱుగుబటులు । వ్రాలుపడగలునెత్తుటదోలుగొడుగు । లలబలమునందు రెంటనుగలిగియుండె॥ సీ॥ పొలసుకేశ్వరి
ప్రేగులనూడియున్నప్రేతవ్రాతములబిదతనమువాసె । బ్రమదలసిస్థిహారములియ్యగోరిన ఢాకినీతతి యభీష్టములుగల్గె। గి
లాలనదులలోగేలిసల్పదలంచుసాకినీసమితికిముచ్చటలునిరె । బచ్చిపీనుగులకై బహుజేశమరుదెంచినట్టి బేతాళుల యాత్మలల
రెం । గ్రొవ్వుమజ్జయు మెదడునుగూర్చి బ్రహ్మరాక్షసశ్రేణులకు సమారాధనంబు । సేయదెంచినదయ్యంపు చెలులయెన్ని
కలునుఫలించెనమ్మహాకదనమునను ॥ శా ॥ ఆలోనంబగవారినన్నోముగినూయాయుద్ధలీలారలిక్ । శైలూషాత్మజులంబరస్థ
లయినజ్ఞామాంసచమాక్సులక్ । శైలాదుల్గురియించిసేననొగిలించంగాంచిగల్పతుయ । త్వేశగ్రీవునికైవడిక్ భరతుడ
త్యుగ్రక్రుధాక్రాంతుడై ॥ శా ॥ సంవర్తారుణమండలస్ఫురదితీక్ష్ణజ్యోతిజృంభియా । సంవర్తాస్త్రముపింటబూర్చి జగముల్
శంకింపగానేసినక్ । సంవర్తాశుగసేగమొప్పనదియుక్ జ్వాలాస్ఫులింగోగ్రమై । సంవర్తాగ్నివలెక్ దహించెనపుడాశైలూ

డనో । పతికదనిన్నుగానలకుబంచెభవజ్జనకుండెఱుంగవే । యకుటిలసత్యసంపదజనాధిపకీర్తివహింపునావుడన్॥క॥ ఆమా
టలువినిసభిక। స్తోమమువిధిచెట్టయనుచుమూఁగరామ।స్వామికడు తెగువచేకొని।సౌమిత్రింజూచిధైర్యసంపదననియెన్॥ చ॥
ఎడపకమొంతతప్పుఘటియించినచోనినువంటితమ్మునిం । కడగివధింపజాలనధిపప్రతిభాన్వితులైనవారికి। న్విడుచుటచంపుటొ
క్కసరినిన్నుద్యజించితినీకునిశ్చయా । నెడకికనేగుదున్నదతడెంతయుశోకవిషాదమూర్తియై॥ క॥ అడలుచునన్నపాదముల
కప్పుడుసాగిలిమ్రొక్కియార్యుల । కడజనముల్వ్యథందు దనుగన్గొనియశ్రులునంచగొల్వవె । ల్వడిసరయూతరంగిణికవా
ర్యధృతికిజుని(?)క్రుంకియోగము । ద్యోడధరియించియాత్మదనయొప్పటిరూపుదలంచునంతలోన్॥చ॥ఎలమిబ్రసూనవృష్టిగురియిం
పుదునింద్రుడువచ్చిశంఖకా । హళములుమ్రోయరంభ మొదలైనచెలుల్నటియింపనమ్మహా । జ్జ్వలసిధిమేనితోడద్రిదివం
బునకుంగొనిపోయెవేడ్కనం । దలిబుధులౌరవచ్చెహరినాలువపాలనిప్రస్తుతింపగాన్॥ గీ॥ దినమునకునిట్లులక్ష్మణదేవుడరిగి
చనటిదివిజాలకేబూజలందికోట।భానుబింబప్రభాభాసమానుడగుచు।నిత్యముక్తాశ్రయంబయినెలవుజేరె॥ ఉ॥ అంతవసిష్ఠ
ముఖ్యులగువార్యులగన్గొనిరాముడిట్లను। స్వాంతగదోచుచున్నయదివిశ్వములక్ష్మణుబాసినిల్వతే । నింతటనుండియున్ భరతుని
ప్పురమేలెడునట్లుసేసిలో । కాంతరగామిహైనభలతానుజునిందిలకింపన్ నేగెదన్॥చ॥అనివినిశీఘ్రదైభరతుడన్నకుసాగిలిమ్రొ
క్కిపలెక్కనో । యనఘులనాథయీధరణిరేటికివింద్రపదాధిపత్యము । చ్చినమిమ్ముబాసినేతుణము సేపయినన్వసియింపజాల
ను । కనిశముసేవజేయుటయెయుచితరాజ్యమువేయునాటికిన్ । క ॥ నరవరకోసరదేశముపరిపాలనసేయగుశునిబట్టము
గట్టుం । మరున్నపము త్తరకోసల । ధరణిబతిజేయుడతనితమ్మునినన్ ॥ చ ॥ అనియెవసిష్ఠుడోరఘుకులాధిపమీపలుకాల
కించియూ । జనులెడవాయలేనివెతజాలివహించిరివీరిదేర్పగా । జనునని రామచంద్రుడుప్రసన్నతనాప్రజజూచిమీరుకో। రివ
నవియేమిచెల్పుడొనరించెదనెట్టిదిదైవనాడున్॥ ఉ॥ పౌరులుమంత్రులున్ భటులుబంధులుబ్రాంజలులైనిల్చియో । కారుణి
కాగ్రగణ్యకలకాలముబ్రోచితిముందుజించిపో । మేరయెపుత్రపౌత్రసఖిమిత్రసహోదరగేహినీసుహృద్వా। ద్వారముతో
బుముంగొలిచినచ్చెదమెక్కజన్నానావుడున్॥ క॥ ఎలనగవెలయరఘూద్వహుండలమనుజులమనవివినికృతాంతులపలుకు । ల్గల
చుకొనిమంచినని తెం । గలవెనమర్థులకసాధ్యకార్యములెందున్॥క॥కోసలకన్యాసుతుడిటు। లాసించినయట్టిప్రజలవలరించి

(*) రాముండు కుశలవులకు బట్టముగట్టుట (*)

కృపం।గోసలదేశముకుబతి।జేసెకుశునిపటుకరటికితాండుశున్ ॥ క ॥ లవునంఘవ్యతిజితమ। ల్లవునంగవిలాసవిభవలజ్జక
రతిపల్లవుడుత్తరకోసలమున । కవనీశ్వరుడధిపుజేసెనార్యులుమెచ్చన్॥గీ॥ఇటులదొరలజేసియిద్దరిసుతులకు। ప్రేమనిచ్చి కట్టి
భూములందు । రావణాహితుడుకుశావతియనుప్రోలుశ్రావితాఖ్యపురముసంఘటించె॥ ఉత్సాహ॥ దేవతాసర్పిరోపదేది
టర్మరాశిసం । భావితాభ్రవిభ్రమత్స్ఫురత్సురేశ్వర । గ్రావబద్ధగోపురప్రకాశములకుశావతీ । శ్రావతాభిదానతత్పు
రంబులొప్పసొంపెయున్ ॥ చ ॥ పురయుగమిట్లొనర్చియటమిత్రులబంపెదుపేళరాఘువుం । డిరువురకున్నమానమగనిచ్చెర
థేభభటాశ్వసంకులం । గరుణగనుంగొనెన్జనకకన్యదలచికవుంగలించిత । చ్చిరములుమూరొక్కనెన్నయ విశేషముతెల్లద
లంచిప్రేముడిన్॥ చ॥ ఇంతులభర్తచేదనయునిట్లుపలాలితులైతదంఘ్రియు । గర్మఖవిభత్స్వఫాలఫలకప్రదసద్ఘనసారరేఖ
లం । జెనకగమ్రొక్కిదీవనలుసేకొనివీడ్కొనిభాప్పపూర్ణలో । చనులయిపోయిరవ్విభుడొసంగినచోట్లను సైన్యసంగతిన్॥
గీ॥ అంతశత్రుఘ్నుడొడతెమ్మనిన్నపాలు । డాపుడగుదూతనొకనిని సనుపవేగి । రమునజనివాడుమూడహొరాత్రముల

(*) శత్రుఘ్నుండు తనకుమారులకు బట్టముగట్టి రామునికడకువచ్చుట. (*)

ము।నధికసౌభాగ్యమధురయామధురజేరి ॥ మ ॥ అలశత్రుఘ్నునిగాంచిలక్ష్మణునిసిర్యాణంబుపౌరాశ్రిజా । దులురామంబ
తిగోల్చిబోవుటకు నుద్యోగింపుటాత్మీయువు । తులకున్ గోసలభూములిచ్చిజననాథుడూర్ధ్వలోకోన్ముఖా। కలితప్రజ్ఞవహిం
చియుసిక మొదలౌ కార్యస్థితుల్ చెప్పినన్॥ క ॥ వీకకలిగియుగలగకయజ్ఞనాథసుతుండుధయిర్యసంపన్నతగాం । చనుడను
పుకోహితునిబుర । జనములబిలిపించిప్రియమెసగనిట్లనియె ॥ గీ ॥ అన్ననెడవాసిలక్ష్మణుండమరపురికి । నేగెనడయెల్లప్రజ
లశోసింకవిభుడు । వెడలనున్నాడట యయోధ్యవిజనమయ్యో । నటవిలోకించితీరెకాలమెటులవచ్చె ॥ ఉ ॥ రామవిభుం
డులేని యమరావతిమైనితృణంబునిల్తునే । యీమధురాపురంబునకు నింకసుబాహువుగ్రపుత్రుని । న్స్వామిగజేయుచ్చువిది
శాపురరాజ్యముశత్రుఘాతికిం । జేసువొసంగిబోయెదను మీరలనుజ్ఞనొసంగుడియ్యెడన్ ॥ క ॥ అనిపలికివారియనుమతి ।
గొనియాయాపురములకును గొడుకులనభిషే । చనమొనరించిచెలిసగముగ । ఘనబలముల బంచియొసగి గమనోన్ముఖు
డై ॥ క ॥ సుతదారాదులవీట్కొని । యతడతిధైర్యమునొంటి యరదముతోత్స్వా । పతిసంప్రేక్షితదూతాన్వితుడయి
సాకేతమునకు నేతెంచివెసన్ ॥ శా ॥ సందర్శించె మహాసభాంతరమునన్ శత్రుఘ్ను డుద్యత్సదా । నందున్ భూరికు
శాశనస్థితుమునీంద్రశ్రేణిసంభావితు । స్సందీప్తానలతేజుశాంత నిరతున్ క్షౌమాంబరోద్ధారుస్వ । చ్ఛందుంజందనభానున్
ఘనసద్వృత్తుస్వామినిన్ రామునిన్ ॥ క ॥ సందర్శించిప్రియమ్ముబు । వందనమొనరించిస్వామి వారిజునజ్ఞ నమున్నలగిభూ

ములఁ । యందునిలిపివచ్చినాఁడనలంకమతిన్ ॥ చ ॥ పలుకులు వేయునేల మిముఁబాసి యొకక్షణమైనఁ జిట్టిభూ । స్థలమునఁ నిల్వఁజాలనిది సత్యము నేనునఁ గొల్చివచ్చెద । న్నలఁడనియానతియ్యకుఁడు తాదృశులెవ్వెడఁ నమ్మియున్నవారలవిడరం చు వేఁడుకొనె రంమనెతాతనిరాముఁడాదృతిన్॥ తత్కాలంబున॥ చ ॥ నరపతియూర్ధ్వలోక గమనంబుచరుల్వినిపంపఁబుత్తు వా । నరులులిశాచన్వునిస్వనాథులఁగూడియయోధ్యకేఁగుదెం । చిరివినయంబుమించ రఘుశేఖరుఁగాంచి పణామముల్ఘ టిం । చిరికరముల్మొగిడ్చిరి వచించిరివెట్లని యిందరొక్కెడన్ ॥ క ॥ ధరణీనాయక మేమిం । దణమన్మిముఁ గొల్చివచ్చు తలఁపునఁనిటకుం । బలు తెంచితి మెడపకమము । గురుకృపనిక వెంటఁబట్టుకొనిపోవఁదగున్ ॥ చ ॥ అను నెడ భానుసూతివినయం బున రాముని జేరిమ్రొక్కి-దేవా । మనుకులనాథ దేవ విభువన్మనివానరరార్యపట్టభ । ద్రునిగనొనర్చిమీచరణముతో యరుదెం బులు గొల్వవచ్చితి । న్ననువిడనాఁడిపోవకుఁడనంబతిసన్మతమొందెనెమ్మదిన్॥ క॥ వాలితలంబుననస్తాంజలియై । యాలోనవిభీ షణుఁడునండకురాఁగా । వాలోకించిరఘూద్వహు । డేలాయీతలఁపు రాత్రిచరేశ్వరనీకు॥ చ॥ ధరణిచరాచరావళులు రాలిచి యుండెమనంతకాలముం । బరమవినీతలంక పరిపాలన సేయుమి దేలయంచును । త్తరము లుపల్కరాకుము సదాచరియించు ధరపద్ధతి । న్నిరతిశయప్రభావమున నెయ్యము ల్వ్హరుమంచుఁబల్కినన్॥ క ॥ రామాజ్ఞకు వెఱచియతం । డేమియునన రేరకుం డెనికకుబుడంతన్ । సామీరి మోముజూచిసు । ధామధుర వచోసిరూఢితగసిట్లని యెన్॥ శా॥ ఏతన్మాత్రుఁడ వేవిభాకరకృపావీక్షాస మాసాదిత । శ్రౌతస్మార్తరహస్యరాశినిభవిఖ్యాతద్భాత్మవిద్యాతాత్పర్యనిరూఢబుద్ధివినిశుద్ధబ్రహ్మచర్యవ్రతో । ద్ధూతాంభ శ్చరకేతనుండ నఖిలస్తుత్యప్రభావోదయా॥ క॥ మత్కీర్తిచంద్రికలయా । పత్కాలము కువలయమునవన్నియొగను దావత్కా లముగ దిచంద్రభ । వత్కాయంబు స్మృత గతిధుర్యంబుగనిల్చున్॥క॥నామాటలునిక్కమగు । నీమగియుకోర్కి-యుఫలించునిత్యు డవగుమిం । కేమియుబలుకకు మనిరఘు రాముఁడువామిరిక నికరంబనుం క్రిన్॥సీ॥ బ్రహ్మసూతురుతకులసార్వభౌముఁ జూచి నీవు చిరకాలజీవివినిర్మలుఁడవు । కలఁగకెప్పటివలె భూమినిఁబ్రమనివ । చించిమైందద్వివిదులవీక్షించివిభుఁడు ॥ చ ॥ బలువగు వేడ్కమీర మృతపానముఁ జేసినవారుగావునం । గలుగదుమీకుహాని చిరకాలమువర్తింపుర్వినంచుఁబె । పలరగఁబల్కి-తే క్కి-నవనాటులనాఁబడి నేఁగుదెందువిం । తిలకతలంచినట్లయని తేటపడన్వరించెనన్యోడన్ ॥ క ॥ ఆరఘురాముని మాటలు । పౌరులుబాంధవులుఁగవులు బహుజానపదుల్ । గోరిక పెండ్లికిఁబోనామువారివలెంజెలఁగి రుత్సవంబులు వెలయన్॥ సీ ॥ చూడ వచ్చినమహీసురులకుదమయిండ్లు వేట్కతోఁ జూరలు విడుచువారు । బిక్కయనుండియే తెంచినయర్థుల కెల్లపదార్థంబులి చ్చువారు । ధరణిదాపుటయినుధర్మమంచుధనంబు చెలఁగినిక్షేపముల్సేయువారు । కళ్యాణమికనింత కంటెనెట్టిదియనిన కలోత్సవంబులొనలువువారు । బంధములుదీరెమనతపఃఫలములొదవె । నెప్పుడిక నేఁగుఁజతివెంటనేపుడువోదు । మంచునల రేయియుగముగా నెంచువారు । నైరిసాకేతమున నున్నయకిలజనుల॥ మ ॥ మఱునాఁడంతవసిష్ఠుఁజూచి రఘురామస్వామిప ల్కెన్మునిశ్వానెడేపరపెష్టివీడుడింకింప నేడ్కవాడల్లెడ । వరిపాటన్నెరవేర్పుఁడంచిత మహాప్రస్థానకర్మంబుమేం । దర సాగింపుఁడుయాగవహ్నులననాతండట్లకావంచినన్ ॥ సీ ॥ పండువెన్నెలడాలు బైటవేయఁగజాలు ప్రవిమలక్షౌమాంబరము లుఁగట్టి । గరుడపచ్చలయేపుపరిహాసింపఁగనోపు దర్భాంకురములుహస్తములఁ దాల్చి । హరినీలములరంగు నపహాసింపఁదొ డంగుఘనకేశబంధమ్ము వెనుకఁ దాల్చి । తమ్మిరేకులఁజోకతగలచేయుమిలోక నములుస్వనాసికాగ్రమున నుంచి । కాంతలక్ష్మినవ సీయుంచుకరిజాతమనఁగ । మొగముపుళకించటటుమౌనముద్రమించ । నేవికారంబులేకయయ్యినకులేంద్రు । డల్లనల్లన నాత్మ

(※) శ్రీరాముఁడు తమ్ములతోడను పౌరులతోడను సరయూనదిని బ్రవేశించుట. (※)

గృహంబు వెడలె॥ వ॥ అప్పుడప్పరమకృపాళుని డాపలిభాగంబునం గరపద్మంబులు ముకుళించుకొని పురలక్ష్మియుమపరించెద క్షిణభాగ్యంబున హ్రీయమతోయజాక్షియాకారంబు ధరియించి దాక్షిణ్యకారుణ్యధైర్యగాంభీర్యస్థైర్యజాతుర్యాది వివిధగు ణంబులతో ననుగమించె ముందరవిజయవినయధర్మసత్యక్షమాశమదమౌదార్యవివేక విశేషంబులతో నుద్యోగంబు గమనించె వెనుకనినేకశస్త్రాస్త్రనివహంబులు పురుషవిగ్రహంబులుధరించి తనుంగొలువ బురుషాకారంబుతో గార్ముకంబనుసరించె ఋగ్యజురాది వేదంబులు బ్రాహ్మణరూపంబులతో నగ్రభాగంబుననరుగుదెంచె దన్మధ్యంబున సావిత్రిమహాదేవి స్త్రీరూప ధారిణియయి సప్తవ్యాహృతులతో ప్రణవంబుతో చందోన్యాసదేవతాభీజశక్తికీలక ప్రముఖ మంత్రాంగకంబుతో సమిత మంత్రతంత్రయంత్రసమూహంబుతో ద్వాత్రింశదుపనిషత్సమేతయైనడచె వద్దెవిపిమంచ స్మృతిశాస్త్రపురాణేతిహాసంబులు పౌరుషవిలాసంబులు వహియించి యనుగమించె సముచితస్థేమంబునం జనరఘురాముని వలోకింపుచు దేవరుషిబ్రహ్మరు షిరాజర్షిశేఖరులప్పరసిద్ధసాధ్యవిద్యాధరప్రముఖనికిలదేవవర్యులు నలుదిక్కులం గ్రిక్కిరిసినమ్మధనంబు గాఁబఱ తెంచిరి దాసీ దాసజనంబునతోఁ బుత్రమిత్రకళత్రంబులతో నాప్తసకిబంధుసోదరముఖ్యులతో నయోధ్యలోఁగల సకలజనంబులు జొట్టువట్లప ల్లెపట్టులంగల ప్రజలు జాలపములు మొదలుగానొక్కండును విడువక యొక్కమొత్తంబై నడతెంచిరి నాగ్నిహోత్రు లుఖనానా హార విశిష్టాగ్రవర్ణులు కుటుంబినసుస్థితంబుగా సంవత్సరములకు గోధనంబుల నన్నిమకొని వెంటఁబడంజనిరి

సుగ్రీవసుషేణగంధమాదన పనసగజగవయగవాక్షశతబలినలనీల వినతకేసరిగ్రథన దధిముఖ ధూమ్రవేగ తారకుముదఖు
జంఘప్రముఖ మహావలీముఖులు ఋక్షవానరసేనాసమేతులై పరమహర్షంబునం గదలిరి వాంశిక వైణిక మార్దళిక మౌరజిక
ఢాక్కిక వైతాళిక వందిమాగధప్రముఖులు వినటగాయకులు భద్రమధుమత్తకాశ్యపప్రముఖసర్మసఖులు గణికాబ్జము
ఖులు నిఖిలకర్మంబులు దిగంద్రోచి నిష్కల్మషభావంబున రామగుణకీర్తనంబులు సేయుచు నతని వెనుకొనిరి విద్వత్పురోహిత
వేదాంతిక తార్కిక వైయాకరణ ప్రముఖులు జన్మబంధంబులు దీరెనని సంబంధులై సింధుబంధుస్నేహానుబంధంబున వెంబడిం
గొలిచిపోయి రదృశ్యభూతంబులు నదృశ్యనగరవాసులు నతిసూక్ష్మశరీరులు నతిస్థూలశరీరులు నరుదెంచిరి పశుపక్షిమృగ
క్రిమికీటకాదులు శైలవృక్షలతాగుల్మాదులు పాదిరహిత పదాభిలాషంబున నయ్యఘశోషణు నాశ్రయించె నివ్విధంబున నఖిల
కరాచరంబు లొక్కదిక్కై నడుచున వ్విటిమహాఘోషంబు ప్రళయసముద్రఘోషంబు ననుసరించె భేరీపణవశంఖాదివాదఘో
షంబుల జాండగర్భనిర్భేదంబాచరించె నించుకయుఁ జలించక కొంచక నిహసుఖంబులు దలంచక దుఃఖించ మేకచిత్తులయి
యజ్జనులందఱుఁ బెండ్లికింబోవుచందంబున రఘునందనపదారవిందంబులు సేవించుచుఁబోయి రవ్వింత చూడవచ్చి వివిధ
రాష్ట్రనివాసులు తమకు సిద్ధియెట్టోవగాక యింతకంటె నేమిని శేషంబులున్నవియని కృతనిశ్చయులై వెంబడించి రిట్లు రఘు
వీరుం డామడదూరంబు మందగమనంబున నతిక్రమించి పశ్చిమవాహినియయిన సరయూనదీతీరంబు చేరంబోయె నయ్యవస
రంబున॥ మ॥ అన్నదికిమ్మహాగ్రమున నంబుజగర్భుఁడు లోకపాలకుల్ । గిన్నరయక్షకింపురుషఖేచరు న్వసురుద్రసంఘముల్ ।
పన్నగులాదితేయులును బ్రంహరుషుల్ గొలువ న్మణిప్రభా । చన్నవిమానకోటులదిశల్వెలుఁగం జనుదెంచె నయ్యెడన్॥ శా॥ ధిం
ధింధింమని మ్రోయుమద్దెళలతో దేవాదిరాడ్భేరికా । ధంధంధానములాకసంబు మెసె నంత దాళసంరావసం । బంధంబుల్ దగ
నాడి రచ్చరలు సవ్యాగ్గీతముల్ పాడిర । గ్గంధర్వుల్ జడివట్టె బెట్టుగురిసెం గల్పప్రసూనచ్ఛటల్॥ క॥ సరసజాక్షుఁడు రాముఁడు ।
సరయూనది జొచ్చె నపుడు సహజన్ములతో । జరణాంభోజములచ్చటి । యరుణాంభోజములు విచ్చె మందుచునలరన్॥ ఉ॥ ఆ
రఘువీరశేఖరు ముఖాబ్జమునందు నిజావలోకనో । దారమలింద్రబృందములు దాల్కొనఁజేసితివిభా రతి । చారుముఖీపదాం
బురుహసంగతహాలసరవానుసారిమం । జీరఝళంఝళంధ్వని విశేషముతో దివినుండి యిట్లనున్॥ క॥ శ్రీరామచంద్ర జగదాధా
రాదివ్యావతార దాశరథా । కారణ్యాసారరవిధుల । హారాభవ్యప్రచార యఖిలస్తవ్యా॥ ఉ॥ ఈయఖిలప్రపంచమున కీవు
విభుండవు దీయవాచ్యమా । మాయ నెఱుంగ మాతరమె మానుషవేషము దానియాదినా । రాయణమా దృష్టిపైయనుచు చరా
వలిగొల్వ ఖగేంద్రు నెక్కి విచ్చేయుము కాలయాపనము సేయగనేల మహాశయ యిచ్చటన్॥ ఉ॥ అవ్యయమప్రమేయ మఖిలాశ్రయ
మక్షయమాద్యమార్యసం । స్తవ్యము నందనవ్యపరతత్త్వము నీవయసృష్టిసాధన । ద్రవ్యగుణాత్మకత్వమునం దాలుతు వేతను
డయి నజాపము । ద్వివ్యశరీరమందఱకు దేవకను గొనవేడ్కయయ్యెడన్॥ క॥ శ్రీరాముసీతయనఁజను । శ్రీరామభవత్పదంబు జేరి
మునుపుగా । నీరాకగోరుచున్నది కోరికయొనగూర్పవయ్యా గొబ్బున ననుచున్॥ క॥ వనజాసనుండు దెలిపిన । విని రాముఁడు సం
తసించి విశ్వజగన్మో । హనలీలావిలసితమగు । తనదివ్యశరీరమాత్మం దలఁచినయనతిన్॥ సీ॥ శతకోటిభాస్కరద్యుతులమిటా
రించుఘనకిరీటము మౌళిఁగానుపించె । శేషభోగీశ్వరశ్రీలరాజిల్లు నాజానులంబిచతుర్భుజములు దోఁచె । నసురులకసురత్వమె
సఁగించు శంఖచక్రగదాసి శార్ఙ్గములెడురహించె । గౌస్తుభశ్రీవత్సకమనీయవైజయంతి కలతో వక్షంబు తేజరిల్లె ధాత
గాంచిన పొక్కిటతమ్మి వెలసెఁ । గటితటంబున దుళకించె గనకపటము । పొలిచె నిఖిలాంగములదివ్యభూషణంబు । లఖిలలో
కంబులవ్వేళ వరుదుదెంచె॥ సీ॥ మకరకుండలవజ్రమహనీయధళధళల్ కిలికేనగవుతో జెలిమిసలుప । మకుటపంకజరాగమణి
రుచుల్వొణిమిథిగపటసంధ్యారాగకాంతబెనుప । శారీరగారుడాత్మచ్ఛాయలు ప్రేలువయిజయంతికతో నవాదులాడ । గరల
గ్నశంఖచక్రశ్రీలు శతకోటి । చంద్రసూర్యులజోకజౌకసేయ । గటితటాబద్ధకనకాంశుకము మెఱుంగు । లసమయాతటిల్లతల
సొంపు దెలసనింత । గరుడవాహనమెక్కె లోకములు పొగడ । రాముఁడవ్వేళ వైకుంఠధాముఁడయ్యె॥ సీ॥ మొసలివాగెయుం
ట్ల కెంపులకేశవద్రుక్కోణసంసక్తరుచులతో సందిసేయ । లలితాలకస్థలాకలితాలకశ్రీలు మకుటనీలముతో ముచ్చటాడ । గీఱ
తేజము కౌక్కెనచంద్రవులట్ల శంఖచక్రములు హస్తములపెలయ । వక్షస్థ్నితేంద్రిరావతీనోజకస్తూరిచెలువునశ్రీవత్సచిహ్నము
మర, కోటదసకోటిళితకోటి గోటికోటి । భానుబింబంబులాకారమూనినట్లు । దుర్నిరీక్ష్యప్రకాశాస్పదైదోచెనిదిగో । విష్ణు
దనిమెంచి రచ్చోటివిబుధవరులు॥ మ॥ అపుడబ్జాసనలోకపాల వసురుద్రాదిత్యులాయిందిరా । ధీలోకైకమనోహరాంచి
తమహాదివ్యాగ్రశ్లాఘ్యము । చ్చపుభక్తిందిలకించుము బహునమస్కారంబులర్పించి ఫా । లపరీతాంజలులయి నుతించిరక
రాళపాతకాగ్న్యబ్ధిరిన్॥ గీ॥ ఎడ తెగక మ్రోసెసురభేరు లేకధార । గాఁగురిసెదివ్యసుమములొక్కమొగిబాడె । రతింగంధ
ర్వులుమగకయాడిరప్స । రోజనములాఖగేంద్రవాధిరాధు నెదుట॥ గీ॥ భరతశత్రుఘ్నులవ్వేళ బ్రహ్మమొదలు । గాఁగలస
మస్తదేవతలిగనుగొనంగ । నద్భుతాఖండతేజోమయాత్ములగుచు । గలసిరద్దేవు దివ్యవిగ్రహమునందు॥ గీ॥ అమలస
రయూజలములదేహంబు విడచి । భానునందనుడర్కబింబమున గలసె । ననబుబ్రాపించెనీలుండు నవ్విధమున । సమరవలశి

ద్యభాగచిత్రితనిజదశావతారకథాసూత్రచిత్రసందర్శనానంద పరవశలోకలోకమిథునస్సంభాషణవిధాధిక వీధికాశతసహస్రసందానితమందారమాలికాకలితవనమాలికాఘుమఘుమాయమానంబును నవరత్నకిరీటఘటితమకరకుండలాంగదకంకణాంగుళీయకకౌస్తుభహారశ్రీవత్సవైజయంతీవనమాలికాకనకకౌశేయ చతుర్భుజశంఖచక్రకౌమోదకీశార్ఙ్గనందకాద్యలంకృతలక్షితసురూపధారావరారోహనార్హారోహిణాచలలసమానవిమానకోటిసంకీర్ణకింకిణీకణకిణారవాపూరితదశదిశావకాశంబును వైడూర్యవిరచితక్రీడాచలాధిత్యకాచరన్నీల్లలకచామణీముఖ చంద్రసేవాసమాగత తారకావారకభ్రమాకరముక్తాఫలవిలసితోపకారికానికాయప్రకాశమానప్రసూనసరధ్వజచ్ఛత్రచామరచిత్రాన్బరముకురాద్యలకారదరీదృశ్యమానంబును గోమేధికరత్నరచితానేక మంటపాంగణమహనీయమాణిక్య మయూరంగవల్లికామతల్లికాంశువల్లికావేల్లితంబును బుష్యరాగమణివిభాసుర ప్రాసాదసమాసాదితజాతరూప వాతాయనరంధ్రాంతికనిస్తంద్రచంద్రకాంత కాంతవేదికాంతరకాంతావిలోకనేందీవర కైరవదళార్చితపదగతాగతభాగవతపదాంబుజంబును ఘనసారగంధసారకాశ్మీర కస్తూరికాదిపరిమళనిత్యనివాసంబును నైకర్బురాలోకదూరంబు గాకుండియుఁ గర్బురాలోకదూరంబై చంద్రవిభవాశ్రయంబుచేత బోయిత్రయరిల్లిచిత్రభానుసంభాషితంబుగాకుండియు జిత్రభానుసంభాషితంబై యనంతమణివిలాసాస్పదంబుగాకుండియు ననంతమణివిలాసాస్పదంబై స్వస్ఫురితప్రకాశాన్వితంబుగాకుండియు స్వస్ఫురితప్రకాశాన్వితంబై చంద్రవిభవాశ్రయంబుగాకుండియుఁ జంద్రవిభవాశ్రయంబై ప్రకృతిగోచరంబుగాకుండియు బ్రకృతిగోచరంబై కరంబు రానించు శ్రీవైకుంఠనగరంబు జేరబోయి త్రయస్త్రింశత్కోటిపురద్వారపాలకులు సాలోక్యసామీప్యసారూప్యవంతులగు పరమభాగవతులు నఖిలప్రపంచమోహనశృంగారవతులగు యువతులు ననేకవిమానకాంతులు దిక్కులం బిక్కటిల్ల దివ్యగంధమాల్యాంబరాభరణవిభాసమానమూర్తులై యాడుచుం బాడుచు నపరిమితవాద్యవిశేషంబులు బోరుకొలువనైవేద్యాని పుష్పాంజలు లిచ్చువారును నానందనర్తనంబులొనర్చువారును నారాయణవిష్ణుకృష్ణగోవిందముకుందాదిదివ్యనామంబులు గ్రహించి సంకీర్తనంబు సలుపువారును గోటికందర్పసౌందర్యను ధారసంబు నేత్రాంబుజంబుచానంబు జేసి రోమాంచకంచుకితాంగులగువారును నాలపట్టంబులు భయవింజామరంబులు ముత్యాలగొడుగులు గరుడ పెక్కంబులుగనక నేత్రంబులు బంగారుసురటులు సౌవర్ణతాళవృత్తంబులు నమృతపూర్ణహేమకలశంబులు మొదలైధరియించి వివిధకైంకర్యపరాయణత్వంబున నగ్రభాగంబున నడుచువారును నై సందడించు వైకుంఠనివాసులతో విష్వదిమూడుకోట్ల దేవతలతో బ్రహ్మరుద్రాదిలోకాధికారులతో బురప్రవేశంబు గావించి యెడనెడ వైష్ణవీరత్నంబులు కర్పూరనీరాజనంబు ముత్యాలసేసను సమర్పింప గోటలు గోపురంబులు గొల్వకూటంబులు రత్నమంటపంబులు జలువచప్పరంబులు రాజమార్గంబులు గృతకాచలంబులుగనక సౌధంబులు దోరణస్తంభంబులుం జూచుచు సకలవిశేషంబుల నొప్పునప్పురంబు నట్టనడుమ నిట్టలంపు పులుదిండి నటులంగట్టిన యభ్యంతరవప్రగోపురద్వారంబున గట్టి కుందనంపు చేట్టు వలంగను పట్టుపిట్టపహుమాయి తేజిదిగ్గనయ్యవసరంబున॥ సీ॥ వలపటనుండి చౌవంచ మోములదు నేదారి నెయ్యమున గ్రదండయొసగె। దలుకువజంపు చెక్కడపుమేర్పావలై ఫణిలోకవిధుడు శ్రీసదములూనె। జారుముక్తామయచ్ఛత్రంబు ధరియించె యెడవాయక సునందుడనుసరించె। గడవన్నెతళుకు బంగరు వీజనము బూని విసరు ఖగరాజు వెంబడించె। గంమబాగాలొసంగు సూడికము వహించె। బుష్పదంతుండు సేనానిభూరివేత్రపాణియై యగ్రమున బరాబరులొనర్చె। హరినిజాభ్యంతరము జేరునవసరమున॥ గీ॥ బలువెల్పురాప్రతిమల చెక్కడపుగండపెండెంబు తాకాల బెరిమజూప। గటిబద్ధకనకాంశుకంబుపై మణులయడ్డిగలయొడ్డాణంబు జిగిదలిర్ప। దళుకుకుంకుమపు గందవుపూతనెఱుపుచునురమున కౌస్తుభంబొప్పుగులుక। నాజానులంబిబాహాతుష్టియమున బంచాయుధస్ఫూర్తి పరిడవిల్లి మకరకుండలవజ్రసంపదలతోడ। ముకురతులితకపోలముల్మెచ్చటాడ। స్వర్ణకోటీరరుచితరత్నవలభులొలయ। నవ్విభుడు సేరెమొదటకభ్యంతరంబు॥ సీ॥ పలమనుంగాత్మనిల్పక నిజాంఘ్రులు గొల్చితటములు సేసిన ధన్యమతులు। నారాయణసమర్పణంబంచు వివిధయజ్ఞంబులొనర్చిన శాంతినిధులు। గోవిందకృష్ణహరేముకుందమాధవయంచు దనుస్మరించిన దాంతియుతులు। దీర్ఘయాత్రలుపోయి దివ్యదేశంబుల దనువులవిడిచిన ధైర్యపతులు। నేయితులసీదళము లెంచి వేయిపేళ్ళ। దినమును స్వకీయపూజసల్పినకృతార్థులచటనుండి క్రియాసక్తిననుసరించి। యెదురుకొని యర్ఘ్యలిచ్చిరనిచ్చలలరి॥ మ॥ ధవునిన్నాద్వి భజించుపోల్కిదసకుక్ దాసత్వము బొందిభ। క్తివిశేషంబున గొల్చుసాత్త్వికులు నర్తింపం గరాబ్జైనరేం। డవకభ్యంతరము ప్రమాధిపుడు పేడక్క్ డాసితద్బక్తవుం। గవులిచ్ఛాహ్వయశక్తితో నొసగుసత్కారంబులం బ్రీతుడై॥ మ॥ వనజాక్షుండఖిలాత్మకత। మునసర్వవ్యాపుడైయుండగా। యనగాకున్నదొకండు లేదను విశిష్టాద్వైతసంఘంబువా। యనియమ్మాడవకత్యజేరిక మవాధ్యక్షుండు దిచ్చక్తితోఁ। దనకున్వారు సపర్యలవ్వగొని మోదంబొప్పగా నావలక్॥ మ॥ చనిపూర్వంబవధూతచర్యలయదృచ్ఛాలాభసంతుష్టులై। తనురక్షాదికకృత్యముల్మరగి కాంతాద్రవ్యకాంక్షావివర్జనులౌ నిత్యవిరక్తులున్న చతురంచద్వారముం జేరియా। న్విసయాభ్యుల్కిమలాభిముక్తిననుసేవింపఁ బ్రహ్మానందంబందుచుక్॥ చ॥ ఇరువదినాల్గుతత్త్వముల నేర్పడగన్గొని గానికవ్వవ। బరగెడిపంచవింశకునభాసనసేయుచు జిర్వివివేకవీ। స్ఫురణలమించు సాంఖ్యులకు జోటగునైదవవాకిటన్గయా। కరుడ హోం దేహోప్రియ కామినిచేవి

విధోపచారముల్॥ మ॥ సరసీజాత్మునిగా జతుర్భుజునిగా సౌవర్ణకా సేయుగా। బరమానందునిగా బ్రసన్నముఖుగా బ్రాదేశమాత్రాంగుగా నిరతంబున్ సుజింత జేసిన సుధీనిర్దోషరత్నావళికా। కరమానావల చోటదృష్టి వలనం గాంచెన్విభుం డర్భకల్॥ సీ॥ నానావిధామానసనాడికాశోధనాభ్యంతరాంగకశుద్ధ లాచరించి। దేశికాకలితోపదేశపద్ధయమనియామాదియోగాదిశయము లెనసి। పరగు బ్రాణాయామబాహుళ్యమున సుషుమ్నాయగర్భమున న్ప్రాణములు సేర్చి। కుండలిమేల్కొల్పి మందు జాఠరశిఖిజ్వాలసుధాధారజల్ల జేసి। యూర్ధ్వముఖషట్సరోజనాళోపరి ప్రభాసురసహస్రదళపద్మవాసి హింస। సంగతి యాహించు హఠయోగిజనులు వృష్టి। గలసి సేవింప సప్తమస్థలము దాటి॥ క॥ ఆనందకరుడార్యజ। నానందకరుండు వారిజాత్ముడు బ్రహ్మా। శౌనామరేంద్రవిష్వ। క్సేనాదులగూడి యువలికింజను వేళన్॥ సీ॥ కోల్లాటమండలోత్ఫుల్లచంద్రికలరో విహరింపనేర్చిన విమలమతులు। రవిశశాంకాగ్రజాగ్రత్తాలకజ్యోతులొకటిగా దిలకింపనోపు ధన్యు। లానన్దదానాహతానూనగానంబుచవి యెరంగిన మహాసవృక్ష్యనిధులు శాంభవీముద్రాశ్వసంరూఢు లైనట్టి బయలు బ్రాకగజాలు బ్రహ్మవిదులు। జననమరణార్తిముఖసమిత్సమితియనుభ। వాగ్ని బ్రేల్చినఘనయజ్వలదనర్చ। రాజయోగాహ్వయసామ్రాజ్యరాజ్యకర్త। లష్టమద్వారగతు లెరటహరిడిగాంచి॥ క॥ సనకసనందనముఖులగు। ననఘులతో నెదురుకొని ప్రియంబున బూజించి। సనలరుచు శ్రీధరుడ। జ్జనములవీడుకొనియవలజనుసమయామునన్॥ సీ॥ గిలుకుమెట్టియలమ్రోతలకంతికాంగుళిభూషణార్భటి ప్రియంబులగణింప। మంజీరసంజాతశింటారవములకు రాయంచరవళి పరాకు దెలుప। గాంచిఘంటాఘణంఘణలకు గరలసత్కంకణధ్వనులు కైదండయొసగ। కర్ణోత్పలాళిఝంకారంబున కుగచో దేశికేకీరుతంబు తెరువు సూప। సూత్రవతియాదిగాగల వేత్రపతులు। నలుగడల నిండుసందడిదంలగ ద్రోయ। నిరుగటల ధాత్రుజేసేళ గుడేర। నిందిరాదేవి గోవిందు నెదురుకొనియె॥ చ॥ ఎదురుగవచ్చి యచ్చెలువ యింపగు వాలుమెఱుంగుచూపులం న్నొందటని నాళియిచ్చి ప్రియము న్నయమున్నవయందు నెమ్మదిన్। గుదుకొని బిమ్మటన్యువతికోటులు శోదపనీయపాత్రికా। సదమలరత్నదీపికలశారికినారతులెత్తి వేడుకన్॥ ఉ॥ ఆరతులెత్తు వేళ జవరారిముఖాబ్జము తేటజూచునో। య్యారపుచూపు జూచిబిగియారుచనాస్గవచూచు మేనిసిం। గారము జూచు జెక్కుల ప్రకాశము జూచు ముకుందు డంతయున్। గౌరవ మొప్ప నెన్నడును గానని వస్తువుగన న్కైవడిన్॥ శా॥ ఆలోభూమిధరించె వీజనముని శ్రీజ్ఞానతీకరుస్వారతాం। బూలంబర్పణ సేయు నూడిగములంబోల్వాంద్రైశ్రీదేవియుం। గైలాగిచ్చిన నేశవార్ధి కవియోగ ప్రాజ్యచింతాభరవ్యాలోలత్వము బాసి కేసవుడు వార్ధాంభోధినోలాడగన్॥ క॥ కమలాకాముని పాణిపంకజము సోకన్ మెగగుర్పారక। కర్కమలాత్సుండని శంబు సాత్త్వికమున గన్పట్టియున్నద్విలా। సమునన్నాత్వికమా నేబుఘవరవిష్వక్సేనశేషాదికుల్। దమశృంగారకళావిశేషములు సందర్శించి హర్షింపగన్॥ శా॥ ఈలాగిందిరగూడి మందరధరుండేర్వంకలన్ వైష్ణవీ। జ్వాలంబుల్విధిపచారములా నర్పలజోచ్చైజనభాదిష। స్నీలాంభోరుహరాజవప్రముఖమాణి

## —(*) పరమపదవర్ణనము. (*)—

క్యోశిరుల్వాంచిత। స్థానస్తంభకవాటకోటిజెలువొ శుంభన్నిజాస్థానమున్॥ వ॥ అనిమిషీయునసంతదివ్యరత్నసమానతేజఃపుంజంబునకాస్పదంబయియపరిమితవిచిత్రచిత్రాంబరసువర్ణపట్టాంశుకప్రతాపంబులగట్టినమేలుకట్లు చెన్నుసంగన్నులకు మిరుమిట్లుగొల్పుచు నలుదిక్కులంబిక్కటిల్లు హరిచందనమందారకల్పక సంతానపారిజాత ప్రసూనవాసనలకాస్పదంబయిన యత్యున్నతస్ఫటికమయ మహాస్తంభకోటుల నీటుల దీటు లేక యనేకబ్రహ్మాండసహస్రంబులంగల ప్రాణులెల్లనొక్కసారిపరతెంచినిల్చిన నొక్కయంకణంబునకురిజాలదనంజాలుచాలువుగలిగి యుగళేయద్రుగంబుజంబులుగల నిజనాథునిపతేలఘుతర వజ్రజాలకరచితజాలకరంధ్రనికాయంబుల నవలోకనీయంబయి కమనీయమాణిక్యమయప్రాకారబమాలికాపరంపరల పెంపునునింపొనర్చుచు దర్పణంబుల టెక్కునం దలక్కనమెరయుకాంతి మచ్చంద్రకాంతకాంత కుడ్యాంతరంబులనెంతయువింతయయి చింతామణిగణనిబద్ధ నిశాలవితర్దికానికరంబులం గరంబురాణించి కెంపుటట్టిలంగట్టిన యుట్టిరంపుమెట్టులంగనుపట్టి సుపమాధిక గోమేధిక తోరణ ప్రాంచితపుష్యరాగ విటంకభాగభాగ పరభాగవిభాగ పరభాగతతులనతులంబయి స్వయంప్రకాశంబై నిత్యముక్తాశ్రయంబయి త్రైకాలికసత్యంబయి స్వతస్సిద్ధంబయి ముముక్షుజనాపేక్షణీయంబయి శుద్ధసత్త్వానందకరంబు గావున నానందమణిమంటపంబున ప్రసిద్ధంబయిన సభామంటపంబు ప్రవేశించి యందు నేపాక్కకంబయి చెలువొందున శేషరత్నచిత్రితసద్రాసనంబుపైవసియుంచి శ్రీదేవీనురంబున నుంచుకొని భూనీళల నిరుపార్శ్వంబుల నిడుకొని యనంతగరుడవిష్వక్సేనాదినిత్యులతో శంఖచక్రగదాశార్ఙ్గనందకాభిరాములు వికటమోహములునాజానులంబిచతుర్బాహులు గౌస్తుభహారకేయూరమకరకుండలాది దివ్యభూషణభూషితులు గనకాంబరధారులు వైజయంతీవనమాలికాదత్తులు పుండరీకాక్షులు గుడాకేశులు నభంగురప్రకాశులు నగు సారూప్యధారులు దాను బూపిన విశ్వరూపంబువలె గణియింపనలవిగాక డాపలిపార్శ్వంబున నిలిచి సేవాంజనులుదాలిచి కొలువుసేయం బాంచజన్యంబోలు కంఠంబులుజకంబుబోలు కటిమండలంబులు సౌర్ఙ్గంబుబోలు కలుబొమలు నందంబు బోలుకీలుజడ గౌస్తుభంబుబోలు కెంమోవులు శ్రీవత్సరుచు [illegible] ముంగురు లునాభిపద్మంబుబోలు ముద్దుమొగంబులు గనకాంబరధ్యులంబోలు నెమ్మేనిచాయలు నీలాబిరా

మంబులుగనూగారుమీనానాగరంబులగు బెళుకువాలుచూపులుగరమరూపసరూపంబులగు ప్రగంబులుంగలవన్నెలాడులుచి న్నారికేండేగిలిగురులంగనకకలశంబులుగా లాంజికలుగుంచెలు సురటులునాలవటంబులు భవవింజారమరంబులుమణిముకు రంబులు బరిమళకరండంబులుజిలుగుపానడలు గర్పూరతాంబూలపేటకలు గమ్మపూబంతులుగాంచనవేత్రంబులు మున్నైనవి ధరియించిపెక్కువగలమాడిగంబులొనరింపసనకసనందనాదులుబాల్యంబువహించిలౌక్యంబులేనిభక్తియోగంబునజెంతనుం డికన్నులముదశ్రుపూరంబులొలుక నానందనాట్యంబొనరింపశతానందుఁడు పులస్త్యపులహప్రముఖనవబ్రహ్మలతో వలవంక నిలిచిసేవింపనేకాదశరుద్రులు ప్రమథగణంబులుగణేశ్వరగుహచండీశ్వరాదులుదన్నుంబిరివేష్టింప నష్టమూర్తిరోమాంచకం చుకితమూర్తియైసహజస్నేహంబుననలువర్తింపునిలింపపాలకుండఖిలలోకపాలకులతో ముప్పదిమూడుకోట్లదేవతలొక్కచ క్కంచికొట్టల్ల నటలఘటితాంజలియైయిభజియింప జిత్రగధహాహాహూహూప్రముఖగంధర్వులతో దుంబురునారదాదులుప రివారిసులు మొరయింపుద నింపుగా నిజబిరుదాంకితగీతంబులువినిపింప ననుకంపాయశకటాక్షంబులభిలషించినలువదినాలుగు కోట్లసహస్రులుపనిష త్పరంపరలుగ్గడింపుచునొక్కదిక్కున నెలకొని యభినందింపరంభోర్వశీమేనకాదిచతుష్షష్టికోట్యప్సరః పాటలాడగులాటలంబాలంబాటవంబునెఱపుచుముందటనటింప నభంగురప్రభావంబుననిండుజోడులేకశతకోటమార్తాండ మండలప్రకాశంబులొక్కరాశియైనట్లు ప్రచండతేజోవిశేషంబున దుర్నిరీక్షణుండైకోటిపుష్పబాణకోదండుల చక్కదనంబు లొక్కటియైనట్లు సకలలోకాశ్చర్యకరసౌందర్యలీలా సవిభ్రమావిర్భావహేతు దివ్యమంగళవిగ్రహంబుచే నభీక్షణీయుం డైనప్రత్యాహార గాయత్రయు. సగాయిత్రీసీమంతపదాంతమణిమాణిక్యకాంతులసిజపాదనఖదచంద్రికలోలయుంబేయుచుండబు రుషాకారంబులువహించికొలిచియున్న బుగ్యజుస్సామాదులనాదరింపుచుసరూపంబులయికొలుచు స్మృతిశాస్త్రపురాణేతిహా సప్రముఖవిద్యలసప్రేమంబుగానవలోకించుచు మెలువులూనినయజ్ఞాద క్రియాళిలాపంబులసర్వజానసమైరాగ్యంబులందగురీతిగా రవింపుచుసర్వనియంతృత్వ సర్వభోక్తృత్వసర్వకర్తృత్వ సర్వపాలకత్వసర్వజ్ఞత్వాది సర్వశక్తియుక్తుండయఖండితప్రభా

(*) శివుఁడు విష్ణునిస్తుతియించుట. (*)

వంబువనిండుకొలువుండెవయ్యావసరంబున॥శా॥ శుక్సంభేధకతత్సభాస్థితబుధస్తోమంబుక్రందెల్ల వి। ష్వక్సేనుండుగరాబ్జసంజ్ఞ లనుమాన్పన్ శౌరినెమ్మోమునన్। దృక్సంఘంబిడిహస్తముల్ మొగిచిగౌరీభర్త పల్కెన్ శిశో । భాక్సాపర్వధునిఘుమంఘుమర వప్రత్యగ్రవాగ్దుంభనన్॥శా॥ శ్రీమంతంబుసనాతనంబువితిభూజిద్బాణబాణాసనో। ద్దామంబాశ్రితరక్షణసమమున్సీతాలక్ష్మణోపేతమై। ర్వ్యామోదప్రదమాంజనేయహితముఖ్యత్తారకంబౌభవ । ద్రామాకారమునామనోంబుజమునన్ ధ్యానింతున శ్రాంతమున్॥శా॥ విశ్వాసంబునవార్తినాన్నడనియూవేల్పుల్మిము న్వేడిన। న్విశ్వామిత్రలుంరనంబునకునావిర్భావముంజెంది యా విస్వామిత్రహితంబుముందుగనేరివిజేసిచెల్వొందదుమీ। శశ్వచ్చిత్రచరిత్రముల్ దలతునశ్రాంతంబుస్వాంతంబునన్ ॥శా॥ ఆదిత్యేందుహుతాశనప్రముఖదీప్యత్కాంతిమచ్చేణికు। చ్ఛేదింపంగదరంబుగాకదరముంజేకూరునజౌతమ। స్త్రీబోషాంధ తమిప్రముక్తషణముల్ భేదించిపేర్కొందుమీ। పాదాంభోజనఖాంశువుల్నిటలముంబ్రాపింపగాప్రమొక్కెదన్॥శా॥ ధర్మా రంభనిరూఢుత్తైజనపతుల్గారొందురొ। దేసీయున్ । శర్మంబుల్ధరణీసుతాపరిణయేచ్ఛస్మీరుమున్నుద్ధతిన్। ధర్మచ్ఛేదనమాచ రించినవిచిత్రంబెంతవర్ణింపచెదన్ । ధర్మాద్యత్నదిగీశరక్షమహోదారప్రభావోదయా॥ మ॥ ఏతత్క్ష్మాధిమజామదగ్నిమదినా వేశించిదుష్టత్వమా। పతులందఱకిక్కపెటరుమార్గడచుభూభారంబువారించిత। ద్గతతేజంబుశరాసనంబుగొనుమీకంగ్రంమలం గొన్నమీయతిగాంభీర్యపరాక్రమాది గుణముహాత్మ్యంబులూహింపెదన్॥ క॥ గురుపులకునాదికారణ । గురుజనిప్రఖ్యాతిగని యురుగుణాజ్ఞ వనాం। తరమునగాంతాసంగతి। జనియించినమీచరిత్రశక్యమెపొగడన్॥ సీ॥ అఖిలలోకములకునభయప్రదాత వైవుబలరియమున్సులకునభయమొసగి।పుణ్యజనప్రీతిబొరసీయుఖరదూషణాదిపుణ్యజనులహతులజేసి। యమృతంబుగొనుపక్షి నాదినేలియుగానవధ్యంబుగొనునారడించి । యాదిత్యజాతకార్యముబూనియుండియు నాదిత్యజాతకార్యమువహించి। వాలిననినొంచివనచరావళులమాన్పి। వనధిబంధించిదానవేశ్వరుజయించి । సీతబ్రాపించిపురిశ్రీవేశించిమించి। ధరణియేలినమి ముగొల్తుబరమపురుష॥క॥అనికొనియాడెవశంభుని।గనుగొవిదరహాసవదనకమలుండైయ।వ్వజనదశేక్షణుడిటులను।ఘనవర్షాం భోదనాదగంభీరోక్తిన్॥మ॥ గిరిజాధీశ్వరనీవునీయజుడునిగీర్వాణరాజాదిది గ్వరునీన్నరయక్షకేచరమరుద్గంధర్వముఖ్యుల్వ నే। చరరూపంబులుదాల్చిశత్రుహతికిన్ సాహాయ్యముంజెందుటన్। సురవిద్వేషణుడీగ్గదాపసమనీకీర్తి పంబుదీనెన్నెదన్॥గీ॥ శిష్టజనరక్షణముదుష్టనిగ్రహణంబు । నవనినొనరిచుకొరకునేనవతరించిమహత్కథాగాంగలహరిగామహిజనుల । పాపపంబాల మడగింతుపాలవయన॥శా॥ శ్రీరామాయణముఖ్యమామకకథాశ్రేణుల్ ప్రసంగింపుచుం। బారీణత్వముమీఱగాజదువుచుంబా టించిమాలింపుచున్।సార॥ప్రజ్ఞరహింపమానవులకున్ షడ్వర్గముల్ దారుజేకూరంభోరికలారుఘోరదురితాగ్నుల్మ్రీయువైశ ర్యముల్॥గీ॥ అనిప్రియబునహరునితోనానతిచ్చి। యజ్ఞసర్వాదిదివిజులదాదరించి కొంతవడికందఱులువీడుకొనికళత్ర। ములు ముగులుగొల్వహరియంత్రీపురమునొచ్చె ఉ॥ చొచ్చినయంగు కెన్నునునుసోరణగండ్లకడానిలోపలం। బచ్చలతల్పులన్ స్ఫటిక

——(*) ప్రళయతలహాదివర్ణనము. (*)——

బంధురకుడ్యములక్షశశాంకర। తోన్నచ్ఛ్రియవేదులన్వెలయునొక్కమహోజ్జ్వలసౌధమెక్కియుం। దచ్ఛవుఫువ్వుచప్పరకుట్టిమములందగుమందిరంబునన్॥గీ॥ కుందనపుదళ్కుచప్పరకోళ్ళగులుకు। మేలిసకిదేలమంచంబుమీదనీవి ప్రమానిపూవులజిగిమించుమంజుశేష। శయ్యగూర్చుండెహరిరమాసహితుగగుచు॥గీ॥ అపుడుభూనీళలనురాగమతిశయిల్ల। సురటవయడపంబుగొనికల్వజూచివెన్నుని డెంతిచెందం బెఱిగినక్వయిరుకరములు।బటివారలగూర్చుండబెట్టుకొనియె॥గీ॥ రాజకీరంబులవ్వేళ రాజవేషధారినైనమున్ను డానున్నమేరలెన్న। నంకగతనైనశ్రీదేవినాచరించ।కపుడుగోవిందుడొకలేనియలుకబూని॥చ॥ అవునవుమంచిదానవశివానిని నేమనవచ్చునొంటికా। నవనిసుంధ్యజెంచిసభయుందవుడిద్ధరద్రోచయివ్వగా। నవమతిజేసివచ్చితివియాకఱుకుందనమాత్మనెంచినన్। దివిరికొనందఱునేనిమొగమింకదలోదరీమణి॥ గీ॥ అనుచుశ్రీలక్ష్మితోబల్కియవ్వదిక్కు। మాఱుమొగమైననేనేమినేరమాచ। రించితినొయంచుధరణిప్రార్థింపనివె। కావెతోడెచ్చితనిచక్రధరుడుపల్కె। అప్పుడు॥మ॥ కరపద్మంబులుమోడ్చిపద్మయనునోకంజాక్షునామీదనే। తిరుగతప్పకణంచిమీరనినవాదింపంగనేనేర్తునే। నరులేమోయొకనిందబెట్టిరనికాంతారంబునంద్రోయబం। పరువెమేండ్లడవాసిగాసిలవెమీపాదంబులూహింపుచున్॥క॥ ననుమునుగ బగనిచటికి। బనుచుతులంపువనుగాదెప్రత్యయమిమం। చనుటమిముగానకుండం। గొనితెచ్చెనెధరణియేలగోపింపగన్॥చ॥ గతజలసేతుబంధ[illegible]కంబనియేమనియెన్నికార్యము। ల్మతినీసహించియున్ననుమాటకెనిచ్చటనేదమెన్నవ। చ్చితిరెయటంచుమోమువలజేసినప్రెయసిజూచిశౌరిన।వ్వతిశమియింతవేయనుచువేమఱుగౌగిటగ్రుచ్చెమచ్చికన్॥క॥ ఉరమునవిల్లుశ్రీరమణినుంచుకభూవనితాంసవీధిశ్రీ। కరముడిసీళపొందొడగలప్రమకరాబ్జముసాచికేళనీ శ్వరశతకోటిరూపవిభవంబెసగన్ఫణిరాట్పణాళిపై। నొఱగిప్రహర్షమొందెహరియుజ్జ్వలిసౌఖ్యరసైకలాడ్యై॥గీ॥ ఇటువలెనీసర్గవైభవంబెసకమెసగ। శ్రీధరానీళలనుగూడిశేషగురుడముఖ్యదా

——(*) గ్రంధపఠన శ్రవణాదఫలము. (*)——

సులప్రోచుచుముదముజెందు।నకిఖిలరక్షోచనుండునారాయణుండు॥గీ॥ఈమహాకావ్యమతిభక్తినెవ్వడువిను।నతడుహంబునసకలసౌఖ్యములజెంది।తనివిగనియంతంబునరాగమవిరహితశాశ్వతబ్రహ్మలోకనివాసమొందు॥సీ॥ఇదిత్రిలోకస్తవ్యమిదివిబుధశ్రావ్యమిదిదివ్యమిదిభవ్యమిద్దియఘవ్య। మతురసభావ్యమాదికావ్యంబిదిద్విజుడుపఠింపవాగ్విదుడసగగు। క్షత్రియుండుపఠింపసర్వసహాభర్తయగు వైశ్యుడుపఠింపనమితపుణ్య। ఫలశాలియాశూద్రకులజుడు పఠింపవంశంబులోవాసివన్నెగాంచు। వఖిలవేదంబులుపఠియింపనగుఫలంబు। నఖిలదానంబులొనరింపనగుఫలంబు। నఖతీర్థంబులనుగ్రుంకనగుఫలంబు। నొరవునికథనొక్కింతచదివినన్॥క॥ప్రత్యక్షరమును నానా।హత్యలునశియించుగరతలామలకగతిం।బ్రత్యక్షంబగు మోక్షముసత్యంబీరామచరితచదువుజనులకున్॥క॥ ఎందాకజెలగువేదము। లెందాకన్దివిజరింతురిందుడుసూర్యుం। డెరిదాకగులగిరులుదగుదానంకబోసంగుదబ్జనానందంబై॥శా॥ వైదర్భికుచగాత్రభంగరచపావైయాత్యసత్వారతా।ప్లోదాజాంబవతీకపోలముకులప్రాంచన్ముఖామిత్రవిం। దాదంతచ్ఛదచుంబనాభిరతభద్రాద్యూతలోలాసుదం। తాదృఙ్మోహనభానుజాంకతలసుప్తాలక్షణాశ్లేషణా॥క॥ శ్రీవత్సగోత్రశుభకర। శ్రీవత్సశ్రితలోదరీకౌస్తుభసు। శ్రీవత్సరవిసహస్ర। శ్రీవత్సప్రముఖదనుజశిఖరిబలారీ॥

మాలిని॥ సరసిజదళనేత్రా చారుసౌవర్ణచేత్రా। గరుడజవనపత్రాకాలభిత్కంకప్రతా। చరణవినతమిత్రా

శాత్రవధ్వాంతమిత్రా। కరధృతఘనగోత్రాకండవిద్వేషగోత్రా॥

గద్యము॥ ఇది శ్రీమదనగోపాలకృపాలలిత కటాక్షవీక్షాపాదిత చతుర్విధాన పద్యకవిత్వవిద్యావధానాధునాతనభోజరాజసకలవిద్వజ్జనాభివర్ణితోదీర్ణవైభవాణః కృతరాజరాజరాజయోగ సామ్రాజ్యలక్ష్మీవిలాసధురంధరధరాధిప సభాంతరస్తవనీయన కళాయుగంధరబంధురమనీషా విశేషమంధాన వసుంధరాధరశోధితగణితగణితశాస్త్రరత్నాకరవినయాది గుణరత్నాకరకరకంకంటివంశపయః పారావార పరిపూర్ణ రాకాసుధాకరాప్పయామాత్య సంక్రందననందన విజ్ఞాన విభవపజిత [illegible]దన విష్ణుమాయావిలాసాభిధాన యక్షగాన నిర్మాణప్రవీణతానిధాన పాపరాజప్రధాన ప్రణీతంబైన శ్రీమదుత్తరరామాయణంబను మహాకావ్యంబునందు సర్వంబును - అష్టమాశ్వాసము.

శ్రీమదుత్తరరామాయణము

సంపూర్ణము.